ప్రొద్దునపూట నవ్యోత్సాహానికి ఒక నూతన పద్ధతిని అలవరచుకోండి...



మార్నింగ్

టూత్‌పేస్టు మీకు నవ్యోత్సాహాన్ని
ఆహ్లాదాన్ని చేకూర్చగలదు

ప్రతి నిత్యం ప్రొద్దున్నే మీ పళ్ళను ట్రస్ట్ (మార్నింగ్) టూత్‌పేస్టుతో పరిశుభ్రంగా తోముకోండి. ట్రస్ట్ టూత్‌పేస్టులో ఇమిడివున్న శక్తివంతమైన మిశ్రమము మీ పళ్ళను సంపూర్ణంగా శుభ్రపరచి ధళధళలాడుతూ. ప్రకాశింప జేయగలదు. ట్రస్ట్ టూత్‌పేస్టు నోటిలోని దుర్గంధాన్ని, దంతక్షయాన్ని నిర్మూలించి, శ్వాసను సువాసనలీనుతూ చేయగలదు. ట్రస్ట్‌తో పళ్ళు తోముకొనే సదభ్యాసాన్ని వెంటనే అలవరచుకోండి

...దీనిని దిన చర్యగా పాటించండి

పురంధామయ్యగారూ, మీ పెద్ద బ్బాయి క్షణం తీరిక లేకుండా పైకీ కిందకీ తిరుగుతున్నాడన్నారు - పైలట్ ఉద్యోగంలోగాని చేరాడా?

'హొటల్ మందాకినిలో లిఫ్ట్ బాయ్'

—పి రమేష్‌బాబు
హైదరాబాదు-47

ఇద్దరు పిల్లలు పుట్టాక, కుటుంబ నియంత్రణ ఆపరేషన్ విష యంలో, మీరు చేయించుకోండని ఆమె, నీవు చేయించుకోమని నేను - యిలా రోజూ పోట్లాడుకొనే వాళ్లం'— అన్నాడు రామనాథం, తన మిత్రు నితో.

'చివరికి ఎవరు చేయించుకున్నారు?'

'ఇద్దరం చేయించుకున్నాం.'

—కె నాగేశ్వర్రావు
నరసారావుపేట

నీ కోసం నేను సప్తసముద్రాలూ దాటమన్నా దాటుతాను.'

'ఆ దాటినవాడివి, తిరిగిరాకుండా అక్కడే వుండు బతికిపోతాను.'

—జి రామకృష్ణ
హైదరాబాదు-28

మిమ్మల్ని చూస్తూంటే, మా మర దలు.............................. గుర్తుకొస్తూంటుంది.... అన్నాడతను సుః

'మిమ్మల్ని చూస్తూంటే నా కెవరు గుర్తుకొస్తారో చెప్పనా? - మా తాత గారు'

—బి మధుకిరణ్
వినుకొండ

# [illegible]

[illegible] నమస్కారములు...
'జ గ తి' [illegible] సమాచారములు [illegible]... నేను వున్న [illegible] ఇబ్బంది లేదు. [illegible] ప్రస్తుతం వున్న [illegible] 'ఫారమ్' లోకి [illegible]. ఈ క్రొత్త యిల్లు [illegible] పెదవి. మరింత గార్డెన్ [illegible] యుంది. నాలుగైదు కుటుంబాలు యుండవచ్చును. ఇంత పెద్ద యిల్లు ఎందుకంటున్నారా- ఏదో మీరందరూ వస్తారనీ, మీ కెటువంటి ఇబ్బంది యు ం డ కూ డ ద నీ ! .... నెమళ్లు, కుక్కలేగాక, జింకలు, లేళ్లు, కుందేళ్లు, పశువులు, మరికొన్ని పక్షులు పెంచాలని ఐడియా....పోయిన జన్మలో ఋషిపుంగవునిగా పుట్టానేమో - విశ్వామిత్రుణ్ణి మట్టుకు కాదు. లేక పోతే, ఈ పశుపక్ష్యాదుల మీద ఇంత ప్రేమ యేమిటి ?

—వై రామకృష్ణ
మజుబుకా—జాంబియా

చందూర్‌గారికి నమస్కారాలు- అక్షరాగ్ని' సమీక్షణం శ్లా ఘ నీ యంగా ఉంది. సరోజినీ ప్రేమ్‌చంద్ గారికి నా నమస్కారాలందీయ గలరు. 17-5-86న జ్యోతిర్మయి అవార్డు ప్రదాన సందర్భంగా 'పామ్‌గ్రోవ్'లో మిమ్మల్ని కలుసుకున్నప్పుడు, నాకెంతో సంతోషమయ్యింది. సౌజన్యాన్ని మీ చూపుల్లో చ ద వ గ లి గా ను.

—ఆచార్య తిరుమల
హైదరాబాదు-7

మిత్రులు చందూర్‌గారికి: శుభ అభినందనలు. రాబోయే సంచిక 360- మీ ఆశయ కేంద్రానికి 360 కోణాల్లో 'జ గ తి' రూపొందింది - 30 సంవత్సరాలు. మీ ఏలూరు 'కథావీధి' సంచికలు, నా మనోవీధిలో కదలాడుతున్నాయ్. ఒకటి రెండు బైండు 1970లలో, నాలుగు వందల పుస్తకాలతో కలసి, మలేషియా ఆంధ్ర సంఘానికి కానుకగావెళ్లి,దూరతీరాల్ని జేరినయ్... మీరు బియన్‌కె ప్రెస్‌లో ముద్రించే 'మాలి' పత్రికను చూడటం, చదవటం, మన పరిచయం— అదంతా పాత జ్ఞాపకాల గాథ. ప్రతినెలా మీరు, మీ పత్రికతో నాకు ఆనందం కలిగిస్తున్నారు. ఎన్నడో సూచించాను - మీ 'డైరీ' పేజీలు ఎడిట్ చేసి ముద్రిస్తే, నడిచేచరిత్ర పదిల పడుతుందని.... మీ దంపతుల చిత్రం ఒకసారి ప్రచురించండి, బావుంటుంది— మిమ్ములను ఇంత పని చేయనిచ్చిన 'కాంతామణి' ఎట్లా వుంటుందో మేమందరమూ దర్శించవద్దా?.. మీ జీవిత సరళి ఒక మాలతీ మాధవం.

—'వెన్నెల' రామారావు
మద్రాసు-24

# ప్రాచీన సాహితి

హృదయ వచ శ్శరీరముల నెంతయు బుణ్య సుధా ప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూడు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణ లవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాస యుక్తులగు మాన్యులు గొందఱు వొల్తురిద్ధరన్

—భర్తృహరి



కృతకాద్రి కందరా కేళీనిగూహన
వేళా పరస్పరా న్వేషణములు
పోషిత మాధవీ పున్నాగ పరిణయో
త్సవ కల్పితానేక సంభ్రమములు
చాతురీ నిర్జిత ద్యూత పణాదాన
కలిత చేలాంచ లాకర్షణములు
సాయం సమారంభ చక్రవాక ద్వంద్వ
విరహావలోకన విభ్రమములు
సాంద్రతర చంద్రికాకేళి చంక్రమములు
విధు శిలామయ వేదికా విశ్రమములు
పలక చిత్రిత నిజరూప భావనములు
మఱచెనో కాక, రుక్మిణి మాయ దగిలి

—తిమ్మన 'పారిజాతాపహరణం'

ఎక్కడి చుట్టపక్కములు నెక్కడి పుత్రులు తల్లిదండ్రులున్
ఎక్కడి సంతపట్టునది యెక్కడనైన ఫలించి యుండెనా
ఎక్కడ దేశదేశములు నండజము ల్గత పొద్దుగ్రుంకితే
ఎక్కడి పక్షులక్కడనె యెవ్వరి బాటలు వారివారికే
నిక్కము కాళహస్తి నిటలాక్షుడ సాంబశివా మహాప్రభో

—కాళహస్తి శతకం

# ఆ [illegible]ళ్లనాటి పిక్చర్

## విజయా వారి 'జగదేకవీరుని కథ'

బహుజనాకర్షణీయమగు చిత్రాలు నిర్మించడంలో ప్రధానపాత్ర కెవి రెడ్డికి సాటి మరొకరు లేరు. ఈ పిక్చరు చూస్తున్నంతసేపూ, యిది సంభవనీయమా అను ప్రశ్న జనించదు. ఎంచేతనంటే, ప్రారంభంలోనే దర్శకులు మనని చంద్రవంశ మహారాజుల కాలంలోకి తీసుకు వెళ్తారు — దేవతలూ మానవులూ సఖ్యంగా వుండే కాల్పనిక లోకమది .... యువరాజైన జగదేక వీరుణ్ణి (యన్ టి రామారావు), — ఈ పున్నమి వెన్నెల వేళ నీకేమి తలంపు కలుగుతోంది? — అని ప్రశ్నిస్తాడు మహారాజు (ముక్కామల), స్వప్నసీమలో తనని వెంటాడుతున్న నలుగురు దేవకన్యలనీ పరిణయమాడి, వారితో సుఖంగా ఉండాలనిపిస్తోంది — అంటాడు. అడక్కూడని ప్రశ్న అడిగిన మహారాజు, అకారణంగా ఆగ్రహించి, తెల్లారేలోగా క్షమాభిక్ష వేడుకోకపోతే, దేశబహిష్కారమే నంటాడు. మనసులో మాట ఉన్నది ఉన్నట్లు చెప్పిన సత్యసంధుడగు జగదేకవీరుడు, తండ్రి ఆజ్ఞ ప్రకారం రాజ్యం వొదిలిపెట్టి, అడవులపాలై, మార్గమధ్యాన తటస్థపడ్డ రెండుచింతల (రేలంగి) అనే మిత్రునితో, దేవకన్యలు జలకాలాడే పన్నీటి కొలను వద్దకువెళ్లి, 'హలా, హలా' అని ఆప్యాయంగా పిల్చుకొనే అప్సరాంగనలను నేత్ర పర్వంగా చూసి, ఆ మొదట శిలయై, తర్వాత మారి, పార్వతీదేవి కరుణాకటాక్షం వల్ల, ఇంద్రకుమారి (బియన్ సరోజ) వల్లె వాటు నియమబద్ధంగా కాజేసి, ఆమెని భార్యగా పొందుతాడు. .... తనకు ఆశ్రయమిచ్చిన త్రిశోకుడనే (రాజనాల) మూర్ఖపురాజు మందుల కోసమై వెళ్లి నాగకుమారిని, వరుణ కుమారిని, అగ్ని కుమారిని వరసగా చేబట్టి, అంటిపెట్టుకున్న రెండు చింతలకు, ఏకాశతో (గిరిజ) పెళ్లీ, పట్టాభిషేకం రెండూ జరిపిస్తాడు. ఆపైన అంధుడైన తండ్రికి తిరిగి కళ్లు రావడం, ఈ జగదీకవీరుని దివ్యశక్తులు దేవతలు పరీక్షించటం, తమ్ముడు జగజ్జిత్తు (లంక సత్యం) సంస్కరింపబడటం మొదలైన అంశాలతో కథనడుస్తుంది. సాహిత్య సంగీతాదులూ, యితర సాంకేతిక విలువలూ ఎంతో ఘనంగా ఉన్నాయి. చూస్తున్నంతసేపూ ఆనందింప జేసే చిత్రం.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి'—సెప్టెంబరు, 1961

ఈ కష్టనిష్ఠుర ప్రపంచంలో స్నేహబాంధవ్యమంత ఉదాత్తమైనది మరొకటి లేదు. స్నేహంలో మనని మనం మర్చిపోతాం – అలా మనని మనం మర్చిపోతే గాని ఉన్నతమైనవేవీ సాధించలేము.

—జెఫ్రీ ఫెర్నాల్

# పత్రికా కెరటాలు

## 'ఆనంద మఠం'

'ఆనంద మఠం' 1770 సంవత్సరపు బెంగాలు మహాక్షామాన్ని పూర్వరంగంగా పెట్టుకొని, 1772లో బెంగాలులోని పూర్ణియా, తిరుహూత్, దినాపూర్‌లలో జరిగిన చరిత్ర ప్రసిద్ధమైన సన్యాసుల తిరుగుబాటు (Sanyasi Rebellion) ఆధారంగా ఒక గొప్ప ఆశయాన్నీ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాయబడిన రాజకీయ నవల. 'గ్లిగ్స్ మెమాయర్స్' అనే గ్రంథంలోనూ, హంటర్ వ్రాసిన 'అనల్స్ ఆఫ్ రూరల్ బెంగాల్' అనే గ్రంథంలోనూ ఈ సన్యాసుల తిరుగుబాటు వర్ణనలున్నాయి. ఈ ఆంగ్ల రచయితలు ఆ సన్యాసులను దేశంలో అరాచకాన్ని సృష్టించడానికి పాల్పడ్డ బందిపోటు ముఠాలనీ, దేశాన్ని కొల్లగొట్టు వారనీ, టిబెట్టు పర్వత శ్రేణులకు దక్షిణాన కుబుల్ నుంచి చైనా హద్దు వరకుగల ప్రదేశంలో వీరు సంచరిస్తూ దారులు కొట్టుతూ ఉండేవారనీ, ఇళ్ళూ వాకిళ్ళూ లేని దేశ ద్రిమ్మరులనీ, వీరిలో చాలావరకు దిగంబరులై తిరిగేవారనీ వర్ణించారు. అయితే వారెన్ హేస్టింగ్స్ తాను వ్రాసిన ఒక లేఖలో ఈ సన్యాసులు యాత్రికులు కావడంచేత దేశప్రజలు వారిని పూజ్య భావంతో చూచేవారనీ, ఆ కారణం చేతనే వారి ఆచూకీని సకాలంలో కనిపెట్టి వారి ఆట కట్టించడం దుస్తరమవుతున్నదనీ వ్రాస్తూ, ఆ సన్యాసులు దృఢగాత్రులనీ, వారి ధైర్యం చెప్పుకోదగిందనీ శ్లాఘించాడు. కాని, ఎడ్వర్ థామ్సన్, జి. టి. గారెట్ అనే చరిత్రకారులు వారన్ హేస్టింగ్స్ వ్రాతలను నమ్మక, సన్యాసుల తిరుగుబాటు అగమ్య గోచరమైన సంఘటనగా కనిపిస్తుందనీ, అందులో ఏదో మర్మమున్నదనీ. ఏమైనా దానిని గూర్చిన సత్యాన్ని భారతీయ చరిత్రకారులే బహిర్గతం చేయవలసి ఉంటుదనీ అన్నారు.

—డి రామలింగం
'స్రవంతి'లో

## 'ఆంధ్ర భూమి'

పాతికేళ్ళపాటు తెలంగాణా ప్రజల కష్టసుఖాల్లో పాలు పంచుకుంటూ, అన్ని సమస్యల్లో జనానికి తోడు నీడగా ఉన్న 'ఆంధ్రభూమి' దినపత్రిక తన సేవలను ఉత్తరాంధ్రకు విస్తరించింది. విశాఖపట్నంలో 'ఆంధ్రభూమి' అవతరించి నేటికి ఏడాది అయింది. అవతరణ సందర్భంలో ప్రకటించిన సంకల్పాన్ని అమలు జరిపేందుకు సకల వరాల

ప్రజా జీవితాలను సంబంధించిన సమస్యలను యథాతథంగా ప్రతిఫలించేందుకు 'ఆంధ్రభూమి' ఉన్న పరిధిలో, పరిమితుల్లో సాధ్యమైనంతగా కృషిచేసింది. ప్రజావంచకుల మోసాలను బట్టబయలు చేసింది. అధికారుల అక్రమాలను ఎదిరించింది. ప్రభుత్వ అవకతవలను ఎలుగెత్తి ఖండించింది. రాజకీయ, సామాజిక రంగాల్లో స్వార్థ, ధూర్తశక్తుల అక్రమాల దుమ్ము దులిపింది. జీవితంలో అన్ని రంగాల్లో వికటతాండవం చేస్తున్న అవినీతితో రాజీలేని పోరాటం సాగించింది. ఏ పార్టీకీ తోక కాకుండా మంచి చెడ్డలను నీరక్షీర న్యాయంగా పరిశీలించి మంచిని బలపర్చింది. చెడును నిరసించింది. 'ఆంధ్రభూమి' విశాఖపట్నం ఎడిషన్ ఈ ఏడాదిలో అనేక ఒడుదుడుకులను దాటింది. ఉత్తరాంధ్ర ప్రజల్లో తనకంటూ ఒక ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకుంది. వివిధ వర్గాలకూ విభిన్న వృత్తులకు చెందిన ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నది. మేధావుల ఆశీస్సులు పొందింది. విద్యార్థుల, యువకుల సహకారంతో ఉత్తేజం పొందింది.

—గజ్జెల మల్లారెడ్డి
'ఆంధ్ర భూమి'

## సామాజిక అడవులు

మనరాష్ట్ర విస్తీర్ణంలో ఇరవై మూడుశాతం మాత్రమే అటవీప్రాంతం. నేటికి ఒక కోటీ పదిలక్షల హెక్టార్ల విస్తీర్ణపు అడవులను నిర్మూలించడం జరిగింది. 1990 నాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో కనీసం ఒకకోటి ముప్పయి లక్షల హెక్టారుల విస్తీర్ణంలో అరణ్యాలను అభివృద్ధి పరచాలని ప్రణాళికా సంఘం సూచించింది. ఈ సూచన అమలుకి దాదాపు వేయి కోట్లు ఖర్చు కాగలదు. ఈ విషయంలో కేంద్ర సహాయం ఇతోధికంగా చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. వాతావరణ పరిరక్షణకు ప్రత్యేకంగా డిపార్టుమెంటు ఆఫ్ ఎన్విరన్‌మెంటు అనే శాఖను కేంద్ర ప్రభుత్వం నెలకొల్పింది. సామాజిక అడవుల పెంపకం ప్రణాళికను రూపొందించింది. అటవీశాఖ, విశ్వవిద్యాలయాల సహాయ సహకారాలతో జాతీయ సేవా పథకం కింద విద్యార్థులకు వృక్షాలునాటే కార్యక్రమాన్ని నిర్వహించేందుకు పిలుపు నిచ్చింది. సామాజిక అడవుల పెంపకం పథకం కింద త్వరితంగా పెరిగే మొక్కల పెంపకానికి 1985-86 సంవత్సరములో అధిక ప్రాధాన్యతను ఇవ్వటం జరిగింది. గత సంవత్సరము 5.5 కోట్ల రూపాయలు ఖర్చుకాగా, 1985-86 సంవత్సరానికి 15 కోట్ల రూపాయలు మేరకు ఖర్చు కాగలదని అంచనా.

—కెవి శాస్త్రి
'యోజన'లో




## మత ప్రభావం

'వచ్చే 25 ఏళ్లలో అమెరికా, సోవియెట్ యూనియన్‌లు ప్రపంచవ్యాప్త అణువిలయానికి దారితీసే పరిస్థితులు సృష్టించవు. అయితే రానున్న పాతికేళ్లలో చిన్న చిన్న అణుయుద్ధాలు జరిగే అవకాశం లేకపోలేదు' – 15 ఏళ్లక్రితం 'ఫ్యూచర్ షాక్' అనే తన పుస్తకంలో సాంఘిక పరివర్తనను విశ్లేషించి ప్రసిద్ధి గాంచిన అల్విన్ టాఫ్లర్ ఈ ఊహాగానం చేశారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత కుదిరిన పొత్తులు, ప్రాంతీయ ఏర్పాట్లు భవిష్యత్తులో మార్పు చెందుతాయని; ఇప్పుడుప్రధానంగా అమెరికా, రష్యాల సారథ్యంలో 'రెండు ధ్రువాలు' గా పనిచేస్తున్న ప్రపంచ రాజకీయ వ్యవస్థ నిరవధికంగా ఇదే స్థితిలో కొనసాగబోదని టాఫ్లర్ అభిప్రాయపడ్డారు. 'మనం ఒక నూతన తరహా సామాజిక, ఆర్థిక వ్యవస్థలోకి ప్రవేశిస్తున్నందున అమెరికా, సోవియట్ యూనియన్, జపాన్, బ్రిటన్‌లలోని రాజకీయ సంస్థలు తమ సిద్ధాంతాలను, విధానాలను భవిష్యత్తులో పునఃపరిశీలించుకుంటాయని భావిస్తున్నట్టు ఆయన చెప్పారు. 'ది థర్డ్ వేవ్' అనే పుస్తకం రాసిన ఈ మధ్యనే 'ది అడాప్టివ్ కార్పొరేషన్' అనే మరొక గ్రంథాన్ని కూడా రాశారు. అమెరికా సమాచార సంస్థ ఉపగ్రహ కార్యక్రమం ద్వారా బాన్, లిస్బన్, రోమ్, వియెన్నా, హేగ్‌లలోని జర్నలిస్టులు, ఇతరులు జరిపిన 'వరల్ నెట్' ఇంటర్వ్యూలో టాఫ్లర్ – భవిష్యత్తులో సంభవించగల రాజకీయ పరిణామాలపట్ల ఈ అభిప్రాయాలు వ్యక్తం చేశారు. అమెరికన్ స్పేస్‌షటిల్ 'ఛాలెంజర్' దుర్ఘటన, సోవియెట్ యూనియన్‌లో సంభవించిన చెర్నోబిల్ అణుశక్తి కేంద్రం ప్రమాదం - రెండు కూడా అపసవ్యమైన నిర్ణయాలు తీసుకోవడంవల్ల జరిగిన ప్రమాదాలేనని ఆయన అన్నారు. 'ఈ సాంకేతిక పరిజ్ఞానం లోపరహితమైనదని నేను విశ్వసించడంలేదు. ఈ సాంకేతిక పరిజ్ఞానం ప్రపంచాన్ని రక్షిస్తుందని కూడా నేను నమ్మను' అని ఆయన పేర్కొన్నారు. వ్యవసాయ పారిశ్రామిక విప్లవాల అనంతరం

మూడవ చరిత్రాత్మక మార్పు పెక్కు పారిశ్రామిక దేశాలను ప్రభావితం చేస్తున్నదని టాఫ్లర్ అభిప్రాయం వ్యక్తం చేశారు. 'ప్రాక్ - పశ్చిమ విభేదాలవల్ల కాక మత విభేదాలవల్ల ప్రపంచం సంక్షోభానికి గురయ్యే ప్రమాదం వుంది. ఈ తరహా ప్రపంచానికి ప్రతికూలంగా మనం కృషి చెయ్యడం అత్యావశ్యకమని నేను భావిస్తున్నాను. ఇస్లాం - పాశ్చాత్య ప్రపంచం మధ్య సంబంధాలు; బౌద్ధం - లక్షలాదిమంది సభ్యులుగల ఇతర పెద్ద మతాలమధ్య సంబంధాలు దృష్టిలో వుంచుకుని నేను మాట్లాడుతున్నాను. ఈ గ్రహంపైన ఈ మతాలు ఏవిధంగా పరస్పర సంబంధాలు కొనసాగిస్తాయన్నదే నా ఆలోచన' అని టాఫ్లర్ పేర్కొన్నారు.

## ప్రత్యామ్నాయం

జనుముకు ప్రత్యామ్నాయాన్ని కనుగొనడానికి జరుగుతున్న పరిశోధనలు ఫలప్రదమైనట్టు కన్పిస్తున్నది. దేశ విభజన ఫలితంగా మన జనుము పరిశ్రమ క్లిష్టపరిస్థితిలో పడింది. అవిభక్త భారతంలో జనుము పండే ప్రాంతాలు పాకిస్తాన్‌లోకి, బంగ్లాదేశ్‌కు చెందిపోయాయి. అయితే ఈ జనుముపై ఆధారపడిన జనప నార మిల్లులలో అత్యధిక భాగం మన దేశంలో ఉండిపోయాయి. ఫలితంగా మన జనపనార మిల్లులు పనిచెయ్యాలంటే వాటికి అవసరమైన జనప నారపై మనం పాకిస్తాన్‌పై ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది. 'జనుము వలె నారలక్షణం కలిగిన మొక్క ఏదైనా మనదేశంలోని వృక్ష సంతతినుంచి లభిస్తుందా?' అని మన శాస్త్రవేత్తలు చిరకాలంగా అన్వేషిస్తున్నారు. ఈ విషయంపై ఎంతో పరిశీలన జరిగిన అనంతరం దేశంలోని అన్ని ప్రాంతాలలో విరివిగా లభించే ఒక మొక్క, జనుము మొక్కకంటె అత్యంత ఉపయోగకరంగా ఉంటుందని, నార దిగుబడి అధికంగా ఉంటుందని, నార దిగుబడి శ్రేష్ఠంగా ఉంటుందని తేలింది. ఈ మొక్కను వృక్షశాస్త్ర పరిభాషలో 'డెకస్టియా క్రోటోస్ ఫోలియా' అని పిలుస్తారు. ఇది బెండ, మందార మొక్కల జాతికి చెందినది. ఈ మొక్క సముద్ర మట్టానికి 500 నుండి 4,500 అడుగులు ఎత్తునగల అన్ని ప్రాంతాల లోనూ ఏపుగా పెరుగుతుంది. దీనికి సారవంతమైన నేలకాని, ఎక్కువగా నీరు కాని అవసరం ఉండదు. ఆరున్నర నుంచి పది అడుగుల ఎత్తువరకు ఇది పెరుగుతుంది. దీని విత్తనాలు కూడా సంవత్సరం పొడవునా లభిస్తాయి. అందువల్ల ఏటా రెండు పంటలను పండించడానికి కూడా అవకాశం ఉంది. ఈ మొక్క కోతకు వచ్చాక దాని మొదళ్లను కోసి 26 రోజులు నీళ్లలో నానబెడితే కాండంపై గల నారభాగాన్ని విడదీయవచ్చు. దీని నుంచి లభించే నార, జనపనార అంత దృఢంగాను, మెరుపుగాను ఉంటుంది. అయితే జనుపనార విషయంలో అను

సరించే రసాయనిక శుద్ధి విధానానికి ఈ కొత్తనార విషయంలో అనుసరించ వలసిన రసాయనిక శుద్ధి విధానానికి తేడా ఉంటుంది. ఈ కొత్త మొక్క 'మాల్వాసియాస్' అనే వృక్ష వర్గానికి చెందినది. జనుము 'దెలియానే' వృక్ష వర్గానికి చెందినది. జనుముకు ప్రత్యా మ్నాయంగా ఈ కొత్త మొక్క ఎంత గానో ఉపయోగపడటమేకాక, జనుము విషయంలో దేశం ఎదుర్కొంటున్న చిక్కు పరిస్థితిని పరిష్కరించగలుగు తుంది.

## బాలప్రపంచం

1959 నవంబరు 20న ఐరాస బాలల హక్కులపై ఆమోదించిన ప్రక టనతో సోవియట్ విధానం పరి పూర్ణంగా ఏకీభవిస్తున్నది. బాలల శారీరక, మానసిక, నైతిక, సాంస్కృ తిక, సాంఘిక అభివృద్ధికి అన్ని అవ కాశాలు కల్పించబడాలని, వారు స్వేచ్ఛాయుత పౌరులుగా, ఆరోగ్య ప్రదమయిన జీవితాన్ని గడిపేందుకు కావలసిన పరిస్థితులను కల్పించాలని యీ ప్రకటన పేర్కొన్నది. సోవియట్ బాల సంఘంలో 10–14 మధ్య వయస్కులైన 2 కోట్ల మంది బాలలు సభ్యులుగా నున్నారు. వీరు ఆయా పాఠశాలలు, అనాథ శరణాలయాలు, బాల సంఘ శిబిరాలు, వగైరా సంస్థ లలో దళాలుగా ఏర్పడతారు. వీరు తమ సర్వసభ్య సమావేశాలలో తమకు సంబంధించిన ముఖ్య సమస్యలన్నిం టినీ చర్చించుకుంటారు. తమ నాయ కత్వాన్ని ఎన్నుకుంటారు. ఈ దళాలు వేర్వేరు క్లబ్బులను, హాబీ గ్రూపులను యితర బృందాలను ఏర్పరచుకుం టాయి. ఇందు క్రీడా, సంగీత, చిత్రకళా నృత్య, నాటక వగైరా బృందాలుం టాయి. బాల సంఘ కార్యకలాపాలను కమ్సొమోల్ పర్యవేక్షిస్తుంటుంది. బాలల సంక్షేమ కృషిలో పాఠశాలే తర సంస్థల పాత్ర గణనీయమయినది. వీనిలో బాల భవనాలు, వేసవి విడు దులు, యువ సాంకేతికజ్ఞుల, ప్రకృతి ప్రేమికుల సంస్థలు, సంగీత – నృత్య కళా బోధనా సంస్థలు, బాల గ్రంథా లయాలు వగైరా ముఖ్యస్థాన మాక్ర మిస్తున్నాయి. ప్రభుత్వం ఏర్పాటు చేసిన యీ సంస్థలు, బాలలు తమకు నచ్చిన బాల సంఘ సభ్యులు చేరి, సామాజికంగా ఉపయుక్తమయిన ఓషధీ మొక్కలను, రద్దు లోహాలను, కాగితాలను సమీకరించడంలోను, చెట్లు నాటడంలోను, కలుపుతీయుట లోను వీధులను ఊడ్చడంలోను వీరు పెద్దలకు తోడ్పడుతున్నారు. పిల్లలు, పని మూలంగా చక్కని వ్యక్తిత్వాన్ని అలవర్చుకుంటారు. దానివల్ల సమాజానికి ఎంతో లాభిస్తుంది. వియ త్నాంలో పిల్లల ఆస్పత్రి, బాలభవన నిర్మాణం కోసం సోవియట్ బాలలు శ్రమదానం చేశారు. రద్దులోహాలను, కాగితాలను ఏరడం ద్వారా లభించిన డబ్బును కూడా వారీ నిధికి విరా ళంగా యిచ్చారు.

## యాంత్రిక దృష్టి

మరమనుషులు మామూలు మనుషులవలె రకరకాల పనులు చేయడమే ఆశ్చర్యకరమైన విషయం; కాగా, ఇప్పుడు ఆ మరమనుషులకు ఒక అత్యాధునిక సాంకేతిక ప్రక్రియలవల్ల 'దృష్టి' కూడా లభించడం ఒక అద్భుతంగా తోస్తుంది. 'యాంత్రిక దృష్టి' (మెషీన్ విజన్) గా పేర్కొనే ఈ ప్రక్రియవల్ల మరమనుషులు, ఇతర అత్యాధునిక పారిశ్రామిక యంత్రాల లాగ ఎక్కడైనా అవకతవకలు కనిపిస్తే సవరించుకోగలుగుతాయి. ఈ 'యాంత్రిక దృష్టి' ప్రక్రియను అమెరికాలోని మోటారువాహనాల ఉత్పత్తిదారులు ఎక్కువగా వినియోగించుకోవాలనుకుంటున్నారు. వారికి ఈ ప్రక్రియ ఎంతో ప్రయోజనకరంగా కనిపిస్తున్నది. అమెరికాలో ప్రసిద్ధి చెందిన మోటారు వాహనాల ఉత్పత్తి సంస్థ జనరల్ మోటార్స్ కంపెనీలో ఇప్పుడున్న మరమనుషులన్నీ కూడా దాదాపు 'గుడ్డివే'. వాటికి చూపు లేదు కనుక అవి కొన్ని నిర్ణీతమైన పనులను మాత్రమే చేయగలుగుతాయని, ఆ మరమనుషులకు 'దృష్టి'ని కల్పిస్తే అవి పెక్కు సంక్లిష్టమైన పనులను నిర్వహిస్తాయని జనరల్ మోటార్స్ కంప్యూటర్ - సైన్స్ విభాగం అధిపతి జార్జి డాడ్ అన్నారు. అమెరికాలో కొత్తగా నెలకొల్పిన కొన్ని మోటారు వాహనాల ఉత్పత్తి సంస్థలలో ఇప్పుడు 'చూపు' గల మరమనుషులను ప్రయోగాత్మకంగా వినియోగిస్తున్నారు. ఇవి మామూలు మనుషులవలెఅతి చిన్న పరికరాలను కూడా అవలీలగా వినియోగిస్తూ చూపరులకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. 'దృష్టి' గల ఈ మరమనుషులు లేజర్లను, వీడియో కెమెరాలను వినియోగించడం మరీ అద్భుతంగా తోస్తుంది.



సూర్యకిరణ్ సమర్పించు
శ్రీ లలిత కళాంజలి
ప్రొడక్షన్స్

"గయ్యాళ్లా... నేనా... హా... హా... హా... పోనీలే ఎవరలా అనుకుంటే అలా కనిపిస్తాను, చూడమ్మా నువ్వు కాపురానికొచ్చిన దగ్గరనుంచి నిన్ను వేళ్లెత్తిమాట్లాడానా... నీ మనసు కష్టపెట్టానా... నేను నీకు అత్తయ్యను మాత్రమే కాదమ్మా... అమ్మను కూడా..."








వాకాడ అప్పారావు   దాట్ల రామకృష్ణంరాజు

వాకాడ తాతయ్య   Bh. సూర్యచంద్రరాజు

PADMALAYA PUBS

కృష్ణా



విజయవాడలో ప్రదర్శన వేళలు: వినోదా: 2-15, 6-15, 9-15.
శేష్‌మహల్ A/C: 12-00, 3-00, 6-45, 9-45. యువరాజ్ A/C ఉ॥గం 11-15ని ఆటలు

'చరిత్రకారుడు' అనే పదం నెహ్రూకు సరిగా అమిరినట్లు 'పండితుడు' అనే పదం రాధాకృష్ణకు చాలా చక్కగా సరిపోతుంది.

ఆధునిక పాశ్చాత్య తాత్విక విచారములోని నూతన రీతులను, విశ్లేషణాత్మక, సంయోగాత్మక శాస్త్రీయ విధానాలనూ తోడు చేసుకొని ఆయన భారతీయ తత్వ చింతనలోని విశిష్టాంశాలనూ హిందూ మతసంపదలి ఆధ్యాత్మికతనూ విస్ఫులీకరించారు. హెగెలియన్ అయిడయలిజమ్‌లోని తార్కిక ప్రయోగాలననుసరిస్తూ అద్వైత వేదాంతమందలి నిగూఢతత్వము ఒక నవ్యనూతన స్వరూపముతో ప్రకాశించింది. రాధాకృష్ణ తమ నిర్దిష్ట భావప్రకటనా కౌశలముతో మత విషయ పరమైన రచనలో సృజనాత్మకత, దార్శనికత్వములో చైతన్య శక్తి చిందులాడించ గలుగుతారు. ప్రొఫెసర్ జోడ్ చెప్పినట్లు, సత్యవిచారము చదివించగల శైలిలో సాగుతుంది.

అరశతాబ్దంపాటు కొనసాగిన డా॥ రాధాకృష్ణ రచనలో కానీ వుపన్యాసాల్లో కానీ అనవరతం కనబడే ముఖ్యమైన అంశం, చదివింపజేసే, వినాలనిపింపజేసే శక్తి. ఇది సాధించడానికి విషయ విస్ఫులీకరణలో గంభీరతను, భావ ప్రకటనలో యథాతథతను ఆయన విడనాడలేదు. చమత్కారమైన వాగ్ధాటి, హాస్యమూ, అతి సామాన్య వుదాహరణలూ మున్నగు ఆకర్షణా విధానాలు కూడా అనుసరించలేదు. ప్రగాఢమైన చింతనకు శ్రేష్ఠమైన ప్రకటనా ప్రకాశాన్ని, నిర్దిష్టమైన విషయ నివేదనకు సుందరమైన వ్యక్తీకరణవిధానాన్ని తోడు చేసుకున్న శైలి ఆయన రచనల్లో స్పష్టమవుతుంది. వారి వక్తృత్వంలో కూడా ప్రశాంతమైన ఏకాంత వాతావరణంలో పండిత శిల్పి పదములను చెక్కి వాక్యములను పేర్చిన తీరు కనబడుతుంది.

టాగూర్ డెబ్బయవ జన్మదిన సందర్భంగా ఆయన చేసిన ప్రసంగంలోని యీ భాగం పరిశీలిస్తే ఆయన శైలిలోని విశిష్టత స్పష్టంగా తెలుస్తుంది.

"రాజాధిరాజుల కంటె వారి సామ్రాజ్యాల కంటె దీర్ఘకాలం జీవించి వుండగలగడమే సాహిత్యానికి గల విచిత్రమైన ఔన్నత్యం. చరిత్ర పుటల్లో సామ్రాజ్యాలనూ రాజ పరంపరలనూ, జాతుల ప్రాబల్యతలనూ మించిపోతూ వుత్తమంగా ప్రకాశించే మానవ మేధా, మానవతా శక్తి మనకు దర్శన మిస్తాయి. హోమర్ నాటి రాజకీయ ప్రపంచం ఏనాడో మరుగున పడింది. కానీ అతను సృష్టించిన సాహిత్యగానం యీ నాటికీ ప్రతిధ్వనిస్తున్నది. రోమ్ సామ్రాజ్యపు వైభవం అంతరించింది. కానీ 'వర్జిల్' కవితా సౌరభాలు పరిమళాలు వెదజల్లుతునే వున్నాయి. కాళిదాసు కావ్యాల్లోని కవితా స్వప్నాలు యీ రోజుకూ సజీవ కంతాలతో మనసులను కదిలిస్తూ మానవ జీవిత విషాదాలకు అశ్రువులను కురిపింపజేస్తున్నవి. కానీ కాళిదాసు ఏ వుజ్జయినీ నగరానికి రత్నంగా భాసించాడో, ఆ వుజ్జయిని మాత్రం స్మృతుల మాటున మాయమయింది. ఈనాటి యీ నాయకులూ, అధినేతలూ కాల



సూర్యకిరణ్ సమర్పించు
శ్రీ లలిత కళాంజలి
ప్రొడక్షన్స్

"గయ్యాళా... నేనా... హా... హా... హా... పోన్లే ఎవరలా
అనుకుంటే అలా కనిపిస్తాను, చూడమ్మా నువ్వు
కాపురానికొచ్చిన దగ్గరనుంచి నిన్ను పల్లెత్తు మాటన్నానా
నీ మనసును కష్టపెట్టానా... నేను నీకు అత్తయ్యను
మాత్రమే కాదమ్మా... అమ్మను కూడా..."








వాకాడ అప్పారావు   దాట్ల రామకృష్ణంరాజు

వాకాడ తాతయ్య   Bh. సూర్యచంద్రరాజు

PADMALAYA PUBS



కృష్ణా

విజయవాడలో ప్రదర్శన వేళలు: వినోదా: 2-15, 6-15, 9-15.
శేష్‌మహల్ A/C: 12-00, 3-00, 6-45, 9-45. యువరాజ్ A/C: ఉ॥గం 11-15ని ఆటలు

అఖిల భారత ఉత్తమ నటి సుహాసిని నటించిన

సృజన మూవీస్



మిస్ అనుపమ



భారతీవాసు పి.రాజేశ్వరి టి.ప్రభాకర్

గర్భంలో కలిసిపోతారు. టాగూరు, తన సాహిత్య గానంతో ఎల్లప్పటికీ ప్రజల హృదయాలలో ఆనందానుభూతులను కుసుమింప జేస్తూ వుంటాడు. మానవ జీవన రాగంలో మాధుర్యాన్ని యినుమడింపచేస్తూ మానవ సభ్యతకు ఒక గంభీర ఔన్నత్యాన్ని టాగూర్ కలగజేశాడు.''

మరికొన్ని ప్రసంగ భాగాలు :

"జాతీయ సమైక్యత సాధించడం అంటే అందరూ ఒకే మూసలో పోసినట్లు వుండటం కాదు. వివిధ రకాల వారందరూ కలసి సామరస్యంతో వుండడం.''

"ఉత్తమత్వము సాధించుటకు ఆత్మసందర్శన మార్గమే ప్రధానమైనది''

"మానవ పరిణతికి ప్రధానాత్మక మైనది మానవాత్మ పరిణతే''

"ఓటమి. చెందిన మానవుడే ఉన్నతత్వం సాధించ గలుగుతాడు. తాను అందుకొనలేని విషయాలను గూర్చి సునిశిత గంభీర పరిశీలనలు చేయ గలడు''

"మనసు మారి రాజీ కుదుర్చుకున్న శత్రువు మంచి స్నేహితుడవుతాడు. ఓడిపోయిన ప్రత్యర్థి కలకాలపు ......''

"క్షణికమైన మానసిక బలహీనతో, సున్నితమైన ఆవేశమో కాదు ప్రేమ అంటే; హృదయమూ, మనసూ, బుద్ధీ మూడూ కలసి పరచిన బాట. ఇది దృఢమైనది, గాఢమైనది, స్థిరమైనది.''

"బాహిరంగా చూస్తే ప్రపంచమంతా సమానంగా ఒకే మూసలో పోసినట్లుగా తయారవుతున్నది. అయితే యీ బాహ్యా ఏకత మనసులూ,

## సినీ చిత్ర పో

1986 జూన్ నెల. ఆ బొమ్మలోని వారు నాగేశ్వరరావు, జయప్రద అని పోటీలో పాల్గొన్నవారందరూ పోల్చుకోగలిగారు. చిత్రం పేరు చెప్పడంలో కొందరు రామకృష్ణులు, ఏడంతస్తుల మేడ, బుచ్చిబాబు అన్నారు. 'శ్రీవారిముచ్చట్లు' అని కరెక్ట్‌గా చెప్పిన 93 శాతంతోను ('ముక్కుపచ్చలారని కాశ్మీరం') — ఆ సన్నివేశం కూడా పేర్కొన్నారు చాలామంది. బహుమతి పొందినవారు: సిహెచ్ ఉమా, కేరాఫ్: భవానీ షూమార్ట్, మెయిన్‌రోడ్, శృంగవరపుకోట — విజయనగరం జిల్లా .... సి. రాధాకృష్ణ, 12ఎ, ఫిరోజిషా రోడ్, న్యూఢిల్లీ–1 .... మొదటి ఇరవై: 1 విజయకుమారి, మద్రాసు 2 సి రమేష్, విజయనగరం 3 కె అనిల్‌కుమార్, మచిలీపట్నం 4 యస్ సత్యనారాయణ, వడ్డాది 5 కె ఎడ్విన్, మంగళగిరి 6 కె రాధ, న్యూఢిల్లీ 7 కె ప్రభాకరరావు, కాకినాడ 8 సి వీరాచార్యులు, రౌతులపూడి 9 జి కోటీశ్వరావు, వెంకటగిరి 10 కె శ్రీనివాసరావు, దాచేపల్లి 11 టి నారాయణరావు, మచిలీపట్నం 12 వి నరేష్ కుమార్, శ్రీకాకుళం 13 అర్ శ్యామల, హనుమకొండ 14 బి సుబ్రహ్మణ్యం, నూజివీడు 15 యమ్ రవికుమార్, బాపట్ల 16 యల్ జానకి, సికింద్రాబాద్ 17 కె యాదగిరి, హైదరాబాదు 18 జి అదినారాయణ, పొన్నెకల్లు 19 అర్ మురుగేశన్, చిత్తూరు 20 పి వెంకటేశ్వర్లు, సామర్లకోట .... విజేతలందరికి అభినందనలు.

ఆత్మలతో కూడిన అంతరంగిక ఐక్య తను నెలకొల్పడంలేదు."

"నీతి సూత్రాలంటే భక్తిశ్రద్ధలుం డటం మంచిదే. కాని మూఢంగా విశ్వ సించడం క్రూరత్వానికి దారి తీస్తుంది"

"జాతీయ వాదం సహజంగా వుద్భ వించిన భావం కాదు - ఒక కృత్రిమ మైన, కొని తెచ్చి పెట్టుకున్న ఆవేశం వంటిది"

"ఇక మానవ పరిణామంలో రావ లసిన మార్పు అతని శరీర భాగాలకు సంబంధించినది కాదు. హృదయంలో రావలసిన పరిణతి" ...."నూతన వ్యవ సను ప్రవేశపెట్టడానికి మనం పోరాడ వలసింది మన అంతరంగంతో కానీ బాహ్య ప్రపంచంతో కాదు"

"మానవుడే నిర్మూలన కారుడు - మానవుడే నిర్మాణ కర్తా. — ఈ కురుక్షేత్రమే ఒకనాటికి ధర్మక్షేత్రంగా మారవచ్చు. ఈ నాగరకతా నిష్క్ర మణం వలన చరిత్రకి నశింపు కలగదు. ఇంకొక నూతన యుగానికి అది నాంది అవుతుంది."

డా॥ రాధాకృష్ణ తమ ఆధ్యాత్మిక అవలోకనలో గొప్ప విశాల దృష్టి కలవారే కాకుండా వివిధ విషయా లకు చెందిన, వివిధ దృక్పథాలను చూపే గ్రంథాలను పఠిస్తూ వుండే వారు. అందువల్లనే ఆనాటి దార్శని కుల, తాత్వికాచార్యులందరిలో మిన్న గా వెలుగొందారు. ఒకవంక గీత, వుపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు వాటికి గల వ్యాఖ్యానాలన్నిటితోసహా క్షుణ్ణంగా అత్యంత శ్రద్ధతో పరిశీలి స్తూనే, వేరొక వంక ఇంగ్లీషులో కొత్తగా ప్రచురించిన కావ్యాలు, కాల్ప నిక సాహిత్యము, చరిత్ర, సంస్కృతి, మతము - తత్వము, వేదాంతము మున్నగు అనేక విషయాలకు చెందిన గ్రంథాలలో ప్రత్యేకత కలిగిన వాటిని కూడా సమానమైన ఆదరంతో చదు వుతూ వుండేవారు.

ఆయన భారతదేశపు ఆధునిక దార్శనికులలో రాజకీయ వేత్త; భారత దేశపు రాజకీయ వేత్తలలో గొప్ప వేదాంతి. సమకాలీన ప్రపంచంలో, రాజకీయ రంగంలోనూ యింకా యితర రంగాలలోనూ నడుస్తున్న విషయాల పట్ల వారికి సమగ్రమైన అవగాహన వుండేది. అందువల్లనే ఆయన రచనల్లో గొప్ప సునిశిత శక్తీ, నవ్య నూతన మైన ప్రజ్ఞతా వుండేవి. ప్రజలన్నా వారి వ్యవహారాలన్నా జర్నలిస్టులలో వుండే ఎడతెగని ఆసక్తి వారికి వుండేది. అయితే ఒక కవిలో వుండే అంతర దృష్టి, సౌందర్యారాధన యీ పరిణతి చెందిన వేదాంతిలో వున్నా యని సాధారణ పాఠకులు గ్రహించ లేకపోవచ్చును.

ఈక్రింది వాక్యాల్లో బెర్నార్డ్‌షా వలె నిశితమైన తీరులో ఆధునిక నాగరి కత హైన్యాన్ని విమర్శిస్తారు రాధా కృష్ణ. "కాలేజీలలో సీటు సులభంగానే సంపాదించ గలుగుతున్నారు, విద్యని అభ్యసించడమే కష్టతరమవుతున్నది చదవడం మాత్రమే నేర్పుతున్నాం విద్యార్థులకు; ఆలోచించడం ఎట్లా?—

అనే శిక్షణను యివ్వలేక పోతున్నాం"
ఇంకొక సందర్భంలో-

"ప్రపంచ దేశాలన్నీ శాంతి కావాలంటున్నాయి; యుద్ధానికి సమాయత్తమవుతున్నాయి"- రాధాకృష్ణ మనోగతి యీ వాక్యాల్లో స్పష్టంగా వెల్లడవుతుంది.

"ఆకాశంలో పక్షులవలె ఎగరడం మానవుడు అభ్యసించాడు. నీటిలో చేపలవలె యీదే నేర్పుకూడా సాధించాడు. అయితే యీ భూమిమీద మనిషి మనిషివలె ఏవిధంగా జీవించాలో మాత్రం తెలియడంలేదు"

రాధాకృష్ణ రచనలో కనబడే పదచిత్రాలు, ఆకాశాన్నందుకునే మహోన్నతమైన భావనాబలం ఆయనలోని కవిని సాక్షాత్కరింపచేస్తాయి.

"మతము అనే ఆధారవృక్షం నుండే గాఢమైన ఆలోచనాసక్తి, సత్యాన్వేషణ, నీతిని గురించిన జిజ్ఞాస పల్లవిస్తాయి. సత్యమూ, శివమూ, సుందరములకై మనసు చేసే అన్వేషణే మానవుడు పరమాత్మకై చేసే అన్వేషణ. మాతృస్తన్యం గ్రోలుతున్న శిశువూ, అసంఖ్యాకమైన నక్షత్రాలవైపు మెడ సారించి చూసే నిరక్షరాస్యుడైన అడవి మనిషీ, తన పరిశోధనశాలలో మైక్రోస్కోపులో సూక్ష్మజీవులను పరికిస్తున్న శాస్త్రవేత్తా, సృష్టిలో కనబడే వుజ్వల సౌందర్యం, దయనీయమైన శోకాగ్ని గూర్చి ఏకాగ్రతతో తలపోస్తున్న కవీ, తారలతో మెరిసిపోయే గగనంవైపో, హిమాలయోన్నత శిఖరాల వైపో, ప్రశాంత సాగరం వైపో దిగ్భ్రమతో చూసే సాధారణ మానవుడూ, వుత్తముడూ వున్నతుడూ అయిన యీ మానవజాతికి చెందిన మనీషి - వీరందరిలో ఈ సృష్టి అనంతమను ఆలోచన; అలౌకికమైన దేదో వున్నదను భావన అస్పష్టంగా కదలాడుతూనే వుంటాయి."

ప్రేమ, వివాహం అనే అతిసామాన్య విషయాలను గురించి కూడా డా॥ రాధాకృష్ణ పలుకులు విశిష్టంగా వుంటాయి. జయదేవుడు, కీట్సు, టాగూర్‌ల ఛాయలు ఆ వాక్యాల్లో దోబూచులాడుతుంటవి.

"ఆకాశం మేఘావృతమై కానరాకుండా వుంది - భవిష్యన్మార్గము దట్టమైన కీకారణ్యములో గుండా పోతున్నది. ఎటు చూసినా ఒంటరితనము, కారు చీకటి. ఒక చిన్న కాంతిరేఖ అయినా కనుచూపు మేరలో లేదు. అన్ని దిక్కులా కష్టాలు ఆవరించుకొని వున్నవి. ఇటువంటి సమయాలలో ప్రేమాస్పదురాలైన స్త్రీఒడిలో మనల్ని మనం అర్పించుకుంటాము"

యదార్థాన్ని యథాతథంగా చిత్రిస్తూనే కమనీయమైన రూపకల్పనతో కూడుకొనివున్న యీ వాక్యాలు చూడండి.

"గేయకవితా శిల్పులు వూహావిహాయసంలో సల్పే మనోహరమైన విహంగయానములకు ప్రేరేపణ కలిగించునవి ఆనందానుభూతులు, సఫలీకృత మనో సంతృప్తులే కాకుండా దుర్నివారము, అనిమిత్తము అయిన ప్రణయమునుండి వుద్భవించిన ఆవేశము."

"వివాహము అంటే ప్రకృతి నిర్దేశించిన శరీర ధర్మ నిర్వహణకూ మానవుని సామాజిక ధర్మ నిర్వహణకూ మధ్య చక్కగా పొసగిన అవగాహన"

"వివాహము ఇలపై స్వర్గాన్ని సృష్టించగలదు. పరిస్థితులు వక్రిస్తే వివాహాన్ని అన్నివిధాలా నరకం లాగాకూడా తయారు చేయవచ్చు"

"హృదయంలో ఆరంభమైన తుఫానులు ఆత్మలోతుల్లో చల్లబడి ప్రశాంత మవుతాయి" "ప్రేమ అంటే ఆవేశాల రూపంలో కాదు: మనసు మనస్సుకై వెదుకుతూ పిలిచే పిల్లని పిలుపు."

ఇరవైశతాబ్దం క్రిందనే వెలువడిన ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాలో భారతీయ చింతనము అనే అంశంపై డా॥ రాధాకృష్ణ రచించిన వ్యాసం ప్రచురణ అయింది. ఈ నాటికీ ఆ విషయంపై అంత క్లుప్తంగా అంత సమగ్రంగా, అంత స్పష్టంగా అంత నైపుణ్యంతో రచించిన వ్యాసం మరొకటి లేదని చెప్పడం అతిశయోక్తి కాదు.

అశాంతీ అలజడీ నిండిన యీ ప్రపంచానికి నిష్కృతి ఆధ్యాత్మిక విలువలను పెంపొందించడం ద్వారానే కలుగుతుందనీ, రాజకీయ ఆర్థిక సమస్యలన్నింటి పరిష్కారానికి మత పరమైన పునాదులు అవసరమనీ డా॥ రాధాకృష్ణ రచనలు వుద్బోధిస్తాయి. తత్వచింతన నిగూఢమూ, దురవగాహమూ, సామాన్యులకు అందుబాటులో లేనిదీ, లౌకిక ప్రపంచము నుంచి సన్యసించినవారికీ అను దురభిప్రాయము కూడా దూరం చేస్తాయి. అత్యంత గోప్యములు అనిరూప్యములు అయిన తాత్విక విషయములు సాధారణ పాఠకునికి అయోమయముగ అనాసక్తి జనకముగ వుండవలసిన అవశ్యకత లేదని నిరూపిస్తాయి. నిజానికి తాత్విక చింతన బెర్నార్డ్‌షా పీఠికలవలె సచైతన్య శక్తియుక్తముగ ఆల్డస్ హాక్స్‌లీ నవలలవలె వుత్తేజపూరితంగా, సి.పి.స్నో. కాల్పనిక వైజ్ఞానిక నవలలవలె వుద్దీపనకరంగా, డా. మార్కస్ అరెలియస్ ధ్యాన చింతనలవలె ప్రౌఢంగా వుండటానికి అవకాశం వుందని నిరూపిస్తాయి.

డా॥ రాధాకృష్ణ గొప్ప పాండిత్య ప్రౌఢిమ తనలో దాచుకున్న లోతైన నిండుకుండ వంటివారు. ఆయన చేసిన వుత్తమ రచనలు విద్యాధికులయిన సామాన్య పాఠకులకు ఆనందకరంగానూ, తత్వాన్వేషకులకూ, పరిశోధనాసక్తి గలవారికి వుపయుక్తంగానూ వుంటాయనడంలో సందేహం లేదు.

("డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్ - 'యాజ్ ఎ మేన్ ఆఫ్ లెటర్స్' (సాహిత్యకారునిగా) డా॥ డి అంజనేయులు ఆంగ్ల ప్రసంగం.... 'ఆకాశవాణి' సౌజన్యంతో.... తెలుగు అనువాదం: సరోజినీ ప్రేమ్‌చంద్)

# డైరీ

1986 జూన్ 10

"1960లో నేను మొదటి సినిమా పాట వ్రాసేందుకు మద్రాసు వచ్చే నాటికి, బాలకృష్ణ యింకా పుట్టలేదు. తెలుగుగంగ మద్రాసు తేవాలని అపర భగీరథునిలా కృషి చేస్తున్నారు యన్టిఆర్; ఆయన కుమారుడు బాలకృష్ణ— 'ముద్దుల కృష్ణయ్య' — ఇవ్వాళ ఆ చిత్రానికి శతదినోత్సవమేగాక, ఆయన జన్మదినోత్సవం కూడా!" — అన్నారు భార్గవ్ ఆర్ట్‌వారి 'ముద్దుల కృష్ణయ్య' నూరు రోజుల పండగ సందర్భంగా- 'వళ్లువార్ కొట్టమ్' లో, ఓపెన్ యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ నారాయణ రెడ్డి.... కోడి రామకృష్ణ దర్శకత్వంలో యస్ గోపాల రెడ్డి, బాలకృష్ణకి విజయశాంతి, రాధ చెరో నాయికగా నిర్మించిన ఈ చిత్రం, ప్రివ్యూ చూస్తున్నప్పుడే నూరు రోజులు ఖాయం అనుకున్నాం - అంతటి 'మసాలా' ఉంది. నేటి వేడుకలకి సభాధ్యక్షులు డివియస్ రాజు; ముఖ్య అతిథి కె రాఘవేంద్రరావు. 'మంగమ్మగారి మనవడు' తో విజయ పరంపర ప్రారంభించిన యస్ గోపాల్ రెడ్డి, 'ముద్దుల కృష్ణయ్య'తో మరొక ఘనవిజయం సాధించారు. శకుంతల - విజయవాడ, రామ్‌శాంతి - మచిలీపట్నం, బాలాజీ - గుడివాడ, నాజ్ అప్సరా - గుంటూరు, రామకృష్ణ - తెనాలి శ్రీనివాస-ఒం చీరాల, కల్పనా - ఏలూరు, నటరాజ్ - భీమవరం, ప్రభాత్ – తాడేపల్లిగూడెం, అన్నపూర్ణ - పాలకొల్లు, వెంకట్రామయ్య - తణుకు, పాలెస్ – కాకినాడ రాజా - రాజమండ్రి, అంబిక - మండపేట, రామా - అమలాపురం, సరస్వతి - విశాఖపట్నం, నవరంగ్ - విశాఖపట్నం, క్రిష్ణా - విజయనగరం, అనితా - నెల్లూరు, ప్రతాప్ - తిరుపతి, మధుసూదన - మదనపల్లి, త్రివేణి - అనంతపురం, తారకరామా - హైదరాబాదు, సుభాష్ – హైదరాబాదు, మనోహర్ - సికింద్రాబాదు, రాధిక - వరంగల్, కిన్నెరసాని - ఖమ్మం .... మొత్తం 28 కేంద్రాలలో నూరు రోజులు .... అంతా బాగానే వుంది గాని అభిమాన సంఘాల జయధ్వానాలు, పోలీసులలాటీ ఝుళిపింపులు, ఆహూతులు కూచునేందుకు చోటులేకపోవటం, పౌర బాధ్యతను ఆరోగ్య నిబంధనలను అతిక్రమిస్తూ అధికసంఖ్యాకుల ప్రవేశానికి అవకాశమివ్వడం, హీరో 'ఇమేజ్ - బిల్డింగ్' కోసం సమస్తం గాలికి వొదిలేయడం, మూలుగుతున్న లక్షలతో అభిమాన సంఘాల ముసుగులో తమ విద్యపట్ల, భవిష్యత్ పట్ల సదవగాహన లేని యువకులని బస్సులలో పట్నం పట్టుకురావడం, ఆ అమాయకుల ఆనందాతి రేకా

నికి, ఈ హీరోలు వుబ్బి తబ్బిబ్బవడం, ఇదంతా హర్షణీయం కాదు. 'వళ్లువర్ కొట్టం' తమిళనాడు ప్రభుత్వ సమాచార శాఖది. ఆ 'హాలు' కి కెపాసిటీ 'యింత' అని వుంది. అభిమానుల హర్షధ్వానాల కోసం ఆ నియమాన్ని ఉల్లంఘించడం అభిలషణీయంకాదనిచిత్రపరిశ్రమలోని ముఖ్యులు గుర్తించాలి; వెనకొకసారి మరొక హీరో విషయంలో 'మ్యూజిక్ అకాడమీ' లో యిలాగే జరిగింది. విజయోత్సాహంలో మన పౌరవిధులు మర్చిపోవడం మంచిది కాదు.

. . . . 11

ప్రఖ్యాత దర్శకులు ప్రసాద్ స్టుడియోస్ అధినేత యల్వి ప్రసాద్ మనుమరాలు (కీర్తి శేషులు ఆనంద బాబు కుమార్తె) సౌ॥ మనోరమా ఆనంద్‌కు, అర్జి రాజన్ కుమారుడు చి॥ జానకి రామన్‌కు ఈ ఉదయం 11 గం॥ 35 ని॥ లకు విజయా శేష్ మహల్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. నూతన వధూవరులపై శుభాక్షితలు చల్లేందుకు మద్రాసు హైదరాబాదు నగరాలలోని ఫిలిమ్ పెద్దలు, యితర ప్రముఖులూ వచ్చారు. ముహూర్తమయాక విందు భోజనం. నవ దంపతులకు మా శుభాకాంక్షలు

. . . . . 14

"నేటి మన అస్తిరత్వం బయట శక్తులవల్ల ఏర్పడినది కాదు - అంతర్గతశక్తులే అందుకు కారణం. జాతీయ స్థాయి నాయకలు అరుదవుతున్నారు; ప్రాంతీయ తత్వాలు పెరిగి విచ్ఛిన్నకర ధోరణులని పెంచుతున్నాయి - ఈ ట్రయిబలిజమ్ నుంచి, ఈ ముఠా మనస్తత్వం నుంచి ఎదగాలి. జాతీయతా భావన పెరగాలి. రచయితలందరూ ఆ గమ్యం వైపుగా ప్రజని నడిపించాలి" — అన్నారు కేంద్ర మంత్రి చిదంబరం, ఈ ఉదయం 'తాజ్ కోరమండల్' కాన్ఫరెన్స్ హాలులో ఆదర్స్ గిల్డ్ ఫర్ నేషనల్ ఇంటిగ్రేషన్‌కి (Authors Guild for National Integration-AGNI) ప్రారంభోత్సవం గావిస్తూ. "మన దేశానికి సాంస్కృతిక ఐక్యత చాలా కాలం నుంచి వున్నప్పటికీ, ఆంగ్లేయులు వొచ్చాకనే రాజకీయంగా ఐక్యత వొనగూడింది. మనకి స్వాతంత్ర్యం వచ్చింది. అయితే తెగలు, కులాలు, శాఖలు,- ఈ 'కాస్ట్- సిస్టమ్', మనని వొదలలేదు. రాజకీయ స్వాతంత్ర్యంతో ఈ 'కాస్ట్ సిస్టమ్' కొత్త ఊపిరి తెచ్చుకొంది, జాతీయ సమైక్యతకు అడ్డుగోడగా నిలుస్తున్నది ఈ కులతత్త్వమే- దాని ప్రభావమే. పద్దెనిమిది భాషల ఈ భరత భూమిని గంగా కావేరి జలాలతో పావన మవుతోందని పాడిన సుబ్రహ్మణ్య భారతి, మా తరం వారిని ముందుకి నడిపాడు," – అన్నారు సభాధ్యక్షులు శివజ్ఞానమ్, – మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఛెయిర్‌మాన్. కులతత్త్వాన్ని నిర్మూలించడం ద్వారా ప్రజల దృష్టిని సమైక్యత వైపుగా మళ్లించవచ్చుననీ, రచయితలందరూ అందుకు తగ్గ కృషి చేయాలనీ అన్నారు, అపార పాండి

త్యమూ, అనుభవజ్ఞానమూ గల 'మా పోసి' (శివజ్ఞానమ్).... భారతదేశం తన సాంస్కృతిక సంపదతో అన్ని దేశాలకూ ఆదర్శప్రాయం కావాలనీ, కాగలదనీ ఆ ధ్యేయం వైపుగా నడుం కట్టాలనీ చెప్పారు జయకాంతన్. బాల బాలికలలో దేశాభిమానం నెల కొనే విధంగా విద్యాబోధన ఉండా లన్నారు మద్రాసు షెరీఫ్ శరవణన్. ఈ దేశ ప్రజల ఆర్థికోన్నతికీ, దేశ సమైక్యతకీ రచయితలు ముందంజ వేయాలన్నారు ఉదయమూర్తి. పుదుమైపిత్తన్, జయకాంతన్, సుజాత, శివశంకరి వంటి ప్రఖ్యాతుల తమిళ రచనలని తెలుగులోకి అనువదించిన మాలతీ చందూర్, వివిధ భాషా సాహిత్యాల మధ్య వంతెనలు ఏర్పడా లనీ, పరస్పర అవగాహనకు దోహదం చేయవలసిన బాధ్యత రచయితలదనీ అన్నారు. ప్రతిదీ రచయిత కలం నుంచి మొదట అక్షరరూపం దాల్చిన తర్వా తనే వ్యాప్తి నొందుతుందనీ ఈ నిప్పు రవ్వ ('అగ్ని') జ్వాలగా వెలుగులు వెదజల్లాలన్నారు ఆలిండియారేడియో స్టేషన్ డైరక్టరు సుబ్రమనియన్. జాతీ యత, దేశీయత చిన్నతనం నుంచీ నేర్పవలసిన ఆవశ్యకత గురించి చెప్పారు మద్రాసు కేంద్ర దూరదర్శిని డైరక్టరు అయ్యంగార్, ఒకే భాష ఒకే వేషాధారణ ఈసువిశాల భారతా వనిలో సాధ్యమయ్యే విషయాలు కావు, భిన్నత్వంలోని ఏకత్వం గుర్తించాలి - అన్నారు అవ్వయ్ నటరాజన్. 'అగ్ని' అధ్యక్షులు శివశంకరి ఆహూతులకు స్వాగతం తెలుపగా, కార్యదర్శి మాలన్ వందన సమర్పణ గావించారు. ఉదయం తొమ్మిదిన్నరకి జయరామన్ బృందం వారి సుమధుర గీతాలతో కార్యక్రమం ప్రారంభమయింది .... మధ్యాహ్నం లంచ్‌కి 'మాపోసి' (శివ జ్ఞానం) లేరుగాని చిదంబరం ఉన్నారు- నలుగురితో కలిసిపోయి, యిష్టా గోష్టిగా మాట్లాడారు.... మధ్యాహ్నం వర్క్‌షాప్.... 'దేశభక్తి అప్పుడు - ఇప్పుడు' అనేది మొదటి అంశం, డి ఆంజనేయులు, ము - మెతా, భారతీ పాల్గొన్న ఈ చర్చావేదికకు అధ్యక్షు లైన 'కల్కీ' రాజేంద్రన్, 'అయ్యో పాపం, జస్టిస్ వెంకట్రామయ్య' అనే చిన్న వ్యాసం చదివి, అమెరికా సం యుక్త రాష్ట్రాలు నిలువుగీతలూ అడ్డ గీతలూ గీసి ఏర్పరిచినట్లుగా మనం కూడా అటువంటి పనిచేస్తేగాని ఐక్యత సాధించలేమేమో నన్నారు. 'జాతీయ సమైక్యతావశ్యకత' చర్చా వేదికలో కోమల్ స్వామినాథన్, నిర్మలా సురేష్, మాలన్ పాల్గొనగా, అధ్యక్షత వహించిన లక్ష్మి, హిందీ పేరు చెప్ప గానే అంత జడుసుకోనక్కర్లేదు, వ్యావ హారిక జ్ఞానంకోసం నేర్చుకున్నంత మాత్రాన మన భాషాసంస్కృతి దెబ్బ తినదు - అన్నారు. టీటైమ్ అయాక మూడవ చర్చావేదికలో 'హిందూ' యన్ రామ్, లీనా తమిళవానన్, శివ శంకరి పాల్గొనగా, అధ్యక్షత వహిం చిన నా పార్థసారథి, సెమినార్లు భాషల మధ్య వారధులవాలి, తమ వారు చెప్పినది మాత్రమే విని వెళ్లిపోవడం

కాకూడదు : సిద్ధాంత రీత్యా హిందీని వ్యతిరేకించడం వేరు, పిడివాదంతో హిందే కాదనడం వేరు - అన్నారు.... అధ్యక్షులు శివశంకరి వందన సమర్పణతో సాయంత్రం అయిదున్నరకి కార్యక్రమం ముగిసింది.... అరవై డెబ్భయి మందిలో ఏ అయిదారుగురో తప్ప మిగతా అందరూ ఎనిమిదిగంటల సేపూ శ్రద్ధగా కూచున్నారు- విన్నారు .... అనుకోకుండా చర్చ హిందీ వైపుకి మళ్లింది - అది అప్రస్తుతం. కాని, యిలాటివి ఒక్కోసారి తప్పవు... 'అగ్ని' జనించినది యిప్పుడిప్పుడే. ఇది ప్రథమ సమావేశం. కొన్ని లోపాలు ఉండవచ్చు.... నాలుగు భాషల వారినీ పిలిచి వుండాలన్నారు ఒకరు.... నిజమేగాని ఈ సంస్థ యింకా ప్రారంభ దశలో ఉంది.... పూర్తిగా కళ్లు తెరవలేదు; 'హిందూ' పత్రిక రామ్, డి ఆంజనేయులు, మాలతీ చందూర్ ఈ ముగ్గురే యింగ్లీషులో ప్రసంగించారు; మిగతా అందరూ తమిళంలోనే మాట్లాడారు .... 'అగ్ని' తమిళ రచయితల సభలాగాక అఖిల భారత స్థాయికి ఎదగ గలిగినప్పుడే, జాతీయ సమైక్యతా కృషిలో చైతన్యవంత మగు పాత్ర వహించ గలుగుతుంది .... శివశంకరి అధ్యక్షులుగా, మాలన్ కార్యదర్శిగా రూపొందిన ఈ 'అగ్ని' శాఖోపశాఖలుగా విస్తరిల్లి, దుష్ట శక్తులని భస్మీపటలం జేస్తూ జాతీయ సమైక్యతా భావనకు పునీతమైన శక్తిని యివ్వాలని మా మనఃపూర్వక ఆకాంక్ష.

. . . . . 22

ఉదయం విజయ కృష్ణా ఆఫీసులో పెసరట్టు ఉప్మా ఇడ్లీతో బ్రేక్‌ఫాస్ట్ అయాక, యస్‌పి కంబైన్స్‌వారి 'పగ సాధిస్తా'లోని మూడు పాటలూ చూపించారు వారి థియేటర్‌లో, ఆచిత్రంలో వున్నవి మూడే పాటలు — అందులో ఒకటి తప్పనిసరిగా చేర్చవలసి వచ్చిన పాట. మూడూ సీతారామశాస్త్రివి - పాడిన వారు: రాజ్ సీతారామ్, సుశీల, వాణీ జయరామ్. సింగారి సిగ్గు తెరలో దాగకు, .... జాలీడే హాలీడే — దూకే కాలానికి హలీడే .... వలపుల కోటి వీణలు - పలికెను నేటి రేయిలో .... మూడు పాటలూ ఊటీలో కొంత, వాహినిలో కొంత నరేష్ కీర్తిలపై చిత్రీకరించారు. మిస్ ఆంధ్ర ప్రదేశ్‌గా గౌరవం పొందిన కీర్తి సింగ్ యిందులో కథానాయిక. సెంచామలై, గిరిబాబు, వేలు, వీరభద్రరావు, విమల్‌రాజ్, భీమరాజు, పి ఆర్ వరలక్ష్మి మున్నగువారున్నారు — జయసుధ గెస్ట్ ఆర్టిస్ట్. గోపీకృష్ణ కెమెరా, సత్యానంద్ సంభాషణలు. స్క్రీన్ ప్లే, దర్శకత్వం: విజయనిర్మల .... "కీర్తి 'లా' చదువుకున్న అమ్మాయి. ఇనస్పెక్టర్ ఉద్యోగం తాత్కాలికంగా విరమించుకు, తనలక్ష్య సాధనకు అంకితమవుతాడు నరేష్. తన తల్లిమరణానికి కారకుడైన విలన్, అంతుబట్టని మనోవేదనకి గురై, చేజేతులా కుమారునీ, భార్యనీ చంపుకొనే పరిస్థితులు సృష్టిస్తాడు హీరో; నిజం తెలుసుకున్న కూతురు బతుకు[illegible]ంది, ఆ విలన్ మరణిస్తాడు".... డైరక్టర్ విజయనిర్మల ఈ కథని

## ముఖ చిత్రం

మహాత్మాగాంధీ, రాజేంద్రప్రసాద్‌ల వల్ల ప్రభావితుడైన జగజీవన్‌రామ్ జీవితమొకరసమయకావ్యం. ఎభై ఏళ్లకు పైగా ఆయన రాజకీయాకాశంలో ప్రకాశించారు. ముప్ఫయ్యయిదేళ్ల పాటు కేంద్రమంత్రిగా ఉన్నారు - కామరాజ్ ప్లాన్ 28 నెలలూ తప్ప! 1977లో 'జె' బాంబుగా ఇందిరాగాంధీ నుంచి విడిపోయి, జనతా విజయానికి కారకులయారు; 1969 కాంగ్రెస్ చీలికలో ఇందిరాగాంధీకి బలం చేకూర్చినదీ జగజీవన్‌రామే! దళిత వర్గాల నాయకునిగా, హరిజనసేవక సంఘ్ అధ్యక్షునిగా, గాంధీజీ, థక్కర్‌బాపా, అంబేద్కర్‌లతో విభేదించినప్పటికీ, తనదైన మార్గంగల ధీరపురుషుడు, అకుంఠిత దేశభక్తుడు. 1937లో బీహారు కౌన్సిల్‌కి ఎన్నుకోబడ్డారు. 1946 నాటి తాత్కాలిక ప్రభుత్వం నుంచి, 1979లో జనతా చీలిపోయేదాకా, రాజకీయంగా ఆయన కీలకస్థానంలోనే ఉన్నారు. జకీర్‌హుస్సేన్ తర్వాత రాష్ట్రపతి అనుకున్నారు- అది జరగలేదు; 1979లో మురార్జీ రాజీనామా తర్వాత, ప్రధాని అవుతాడనుకున్నారు - అది జరగనివ్వలేదు. 1980 మంతనాలలో కాంగ్రెస్ ప్రెసిడెంట్ అవుతాడనుకున్నారు - ద్వితీయస్థానానికి (వర్కింగ్ ప్రెసిడెంట్) వొడబడకపోవడం వల్ల, అదీ జరగలేదు. ఆధునిక మహాభారతంలో కర్ణునితో పోల్చదగ్గ మహావ్యక్తి, - బాబూజీ- కాలయవనిక వెనక్కి వెళ్లిపోయారు ☼

ఎంత రసవత్తరంగా చెప్పారూ అంటే, చెవులు దోరబెట్టుకు వినడమంటారే, అలా విన్నారు పాత్రికేయులు. మాంఛి సస్పెన్స్‌గల థీమ్; కథాబలమే ఈ చిత్రానికి ఊపిరి. యువక హీరోగా నరేష్, అందాల సుందరిగా కీర్తి తెలుగు ప్రేక్షకులని మెప్పిస్తారు. డైరక్టరుగా విజయనిర్మల ఒక విశిష్ట స్థానమందుకున్నారు. మీరిది చదివేనాటికి ఈ చిత్రం విడుదలై వుండవచ్చు. పి ఆర్ ఓ: రాజు....... శ్రీకృష్ణ చిత్రా ప్రింటర్స్ అధినేత బివి నరసింహారావు మూడో అమ్మాయి సౌ॥ గౌరీరమకు, చి॥ సత్యనారాయణ రావుకు ఈ ఉదయం 10గం॥ 59 ని॥లకు సింహలగ్నంలో వేదోక్తంగా వివాహం జరిగింది. బంధుమిత్రులనేకులు శుభాక్షితలతో నూతన వధూవరులని ఆశీర్వదించారు. పెళ్లి భోజనమై యిల్లు చేరుకొనేసరికి టివిలో రజని....... నిన్న మధ్యాహ్నం పి ఆర్ ఒ రామకృష్ణ, మగధీరునిగా చిరంజీవి రంగుల చిత్రం గల ఇన్‌టిమేషనూ, తీపిగుర్తుగా రసగుల్లాల సీల్డ్ టిన్నూ స్వయంగా పట్టుకొచ్చి యిచ్చారు. 'ఇలా ఎంతమందికి అందజేశారు?' అని అడిగాను, - కారులో అయినప్పటికీ ఎర్రటిఎండవేళ వచ్చిన రామకృష్ణ, కాస్త చల్లటి మంచినీళ్లు పుచ్చుకున్నాక! 'నలుగురం నాలుగు వైపులకీ వెళ్లి పరిశ్రమలోని అయిదారువందల మందికి అందజేశాం ఈ ఇన్‌టిమేషనూ, రసగుల్లా టిన్నూ'- అన్నారాయన.... విజయా బాపినీడు ఏది తలపెట్టినా, ఒక ప్రత్యేక వరవడి అనుసరిస్తారు. మూడురోజుల క్రితం క్లోజ్‌డ్ కవరులో ఈ శతదినోత్సవ వేడుకకు ఆహ్వానిస్తూ లెటర్ వచ్చింది - జర్నలిస్టుల సమక్షంలో జరిగే ఈ ఫంక్షన్‌లో చిత్రంలోని నటీనటులు, సాంకేతిక నిపుణులు, పంపిణీ దారులు మాత్రమే పాల్గొంటున్నారనీ, సాధారణ శతదినోత్సవాలకి ఇది భిన్నమైన రీతిలో వుంటుందనీ తెలిపారు. నిజానికిది శత- ప్లస్- దశ అంటే 110వ దినోత్సవం.... 'మగధీరుడు' చిత్రం విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు, కాకినాడ, రాజమండ్రి, మచిలీపట్నం, తెనాలి, నెల్లూరు, తిరుపతి, కడప, అనంతపురం, హైదరాబాద్, వరంగల్ పట్నాలలో 110 రోజులు విజయవంతంగా ప్రదర్శింపబడింది - ఇంకా ప్రదర్శింపబడుతోంది. మా 'పెద్ద మధురానుభూతి'కి చిహ్నంగా మీ కోసం పంపుతున్న ఈ చిన్న 'మధురం' (రసగుల్లాల టిన్) స్వీకరించమన్నారు - సన్మిత్రుల నుద్దేశిస్తూ, మాగంటి రవీంద్రనాథ్ చౌదరి తమ శుభవార్తా పత్రికలో. ధనలక్ష్మీ కాలనీలో, శ్యాంప్రసాద్ ఆర్ట్‌వారి ఆఫీసుకి చేరువని, దీపతోరణాల మధ్య జర్నలిస్టులూ, 'మగధీరుడు' చిత్రానికి జరిగిన ఈ వేడుకకు హాజరయినది సంబంధించిన వారూను. పత్రికలకూ, పరిశ్రమకుగల బాంధవ్యాన్ని దృఢతరం చేసే ప్రయత్నంలో మొదటి మెట్టుగా, జర్నలిస్టుగా జీవితం

ప్రారంభించి, నిర్మాతగా, దర్శకునిగా దర్శక నిర్మాతగా ఎంతో ఎత్తుకు ఎదిగిన విజయా బాపినీడు, - పత్రికలవారిచేత జ్ఞాపికలందజేసే, ఒక సత్సంప్రదాయానికి శ్రీకారం చుట్టారు - చిరంజీవి అన్నట్లు సౌమ్యతకి, సహృదయతకి, సద్భావానికి మారుపేరు విజయా బాపినీడు. ఆయన మంచితనానికి జడిసే కావచ్చు, బెదిరించిన వర్షపుజల్లు వెనక్కి తగ్గింది. కార్యక్రమమంతా పరస్పర పలకరింపులతో, కబుర్లతో, జ్ఞాపికా సత్కారంతో, లక్కీ కూపనులు వచ్చిన అయిదుగురూ ఎవరా అనే అదృష్టపరీక్షతో, ఉపన్యాసాలూ పొగడ్తలూ లేకుండా, రెండే రెండు వాక్యాల 'మగధీరుని' (చిరంజీవి) ముగింపుతో ఈ సమావేశమెంతో రక్తి కట్టింది; రంజనవానగూర్చింది, సంతోషాన్ని పంచుకొనే కొత్తపద్ధతి చూపించిన విజయా బాపినీడు అభినందనీయులు ........

పిఆర్ఒ : రామకృష్ణ

. . . . 23

కట్టా సుబ్బారావు దర్శకులుగా, సికెయమ్ ఛటర్జీ నిర్మిస్తున్న 'సీత పుట్టిన దేశం' లోని గీతాలు (రాంశ్యాం ఆర్ట్ క్రియేషన్స్) గుడ్‌లక్‌లో చూపించారు. మురళీమోహన్, విజయశాంతి, శారద, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, రూపాచక్రవర్తి, పియల్ నారాయణ, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం మున్నగువారున్నారు. వేటూరి పాటలు, రాజన్ - నాగేంద్ర సంగీతం, కాశీ విశ్వనాథ్ మాటలు.... చైత్ర మాసంలో ప్రియురాలి మైత్రి కోసం, ఎద కోయిలకాగా మది వేణువయిందట.... హృదయమన్న ప్రమిదలో







ఒక దీపం వెలిగిందట.... 'సీత పుట్టిన దేశం' లోని ఈ ప్రణయాను రక్తి ఏవిధంగా పరిణమించేదీ చిత్రం చూశాకగాని చెప్పలేము. ........ 'ఆ తర్వాత హోటల్ సవేరాలో, ఎండలో నీడలా, నీడలో నిదురలా, వలపొచ్చి వాలే' - కౌముదీ పిక్చర్స్ 'ఓ ప్రేమ కథ'లోని 'మల్లెమాల' పాటల కాసెట్లు పత్రికలవారికి బహూకరిస్తూ, అను కున్న వ్యవధికంటె ముందే ముగించిన 'తలంబ్రాలు' చిత్రం గురించి చెప్పారు. యమ్మెస్ రెడ్డి. తండ్రీ కొడుకుల చిత్రా లకి సంయుక్తంగా ఏర్పాటు చేసినట్లు వుంది ఈ ప్రెస్ మీట్ – అలాగాక దేనికది వేరేగా అయితే బాగుండేది. 'తలంబ్రాలు' డైరక్టర్ కోడి రామ కృష్ణ, చిన్న బడ్జెట్ చిత్రాల ఆవశ్యకత గురించి చెప్పారు. సభాధ్యక్షత వహించిన మాల్కొండయ్య, యమ్మెస్ రెడ్డి కవితా శిల్పం గురించి ప్రశంసిం చారు. ముప్పయి నలభై ఏళ్ల క్రితం తను వ్రాసిన 'కరిమింగిన వెలగపండు' సినిమా మార్పులతో, 'ఓ ప్రేమ కథ' గా వెండితెర కెక్కుతోం దన్నారు రావూరి భరద్వాజ. తెలుగు చలనచిత్ర సీమలో తనకు పునః ప్రవేశం కలిగించినందుకు కృతజ్ఞతలు తెలిపారు సంగీత దర్శకులు రంగా రావు. 'తలంబ్రాలు'లో జీవిత, కళ్యాణ చక్రవర్తి వున్నారు ; 'ఓ ప్రేమకథలో రాధిక, సర్వదమన బెనర్జీ వున్నారు. కాన్పూర్‌లో పెరిగిన బెంగాలీ, పూనెలో చదువుకు, మద్రాసులో తెలుగుచిత్ర సీమకు పరిచయమై, వరంగల్లులోని కళాభిమానుల చేత సత్కరింపబడటం ('సిరి వెన్నెల' తర్వాత), మన జాతీయ సమైక్యతకు, సినీకళకు భాషాబంధాలు లేవనే సత్యా నికీ నిదర్శనాలు కావా?– అని ఆడి గారు బెనర్జీ. ఏడాదీ ఏడాదిన్నరలో తెలుగు నేర్చుకు, తెలుగులో మాట్లాడ వలసిన బాధ్యత తనపై వున్న దన్నారు.... సమావేశా నంతరం డిన్నర్. పిఆర్ఒ : శ్రీకృష్ణ.

. . . .24

యమ్మెమ్ థియేటర్లో బ్రేక్‌ఫాస్టూ, కృష్ణ చిత్రావారి 'అరుణ కిరణం' పాటల ప్రొజెక్షనూ! మెడిసిన్ చదువు కున్న అమ్మాయి, తన భర్త అభీష్ట ప్రకారం వైద్యవృత్తి మానేసి, గృహి ణిగా కాలం గడిపి, తదుపరి పరి స్థితుల కారణంగా తిరిగీ డాక్టర్ అవ డం, భర్త నిరాదరణకు గురికావడం ఈ చిత్రకథలోని ప్రధానాంశం. ఆధునిక వనిత వంటింటి కుందేలు అయేందుకు అంగీకరించదు. – సం ఘంలో తన బాధ్యతాయుత స్థానం నిర్వహిస్తానంటుంది. పవిత్రంగా కళ్ల కద్దుకున్న నల్లపూసలని పురుషాహం కారం తెంచి పారేస్తే, కూలిన మేడతో కుంగిపోక, తన కర్తవ్యం తెలుసుకుం టుంది అరుణ (విజయశాంతి). నాయ కుడు: రాజశేఖర్. నూతన నటి శ్వేత, ఈ చిత్రంతో పరిచయమవుతున్నది. దర్శకత్వం: ముత్యాల సుబ్బయ్య. నిర్మాణ సారథి: హరికృష్ణ .... పిఆర్ ఒ : జగన్

. . . . 28

సురేష్ మహల్‌లో 'కెప్టెన్ నాగార్జున' పాటల ప్రొజెక్షన్ – మొత్తం ఏడుపాటలలో అయిదుపాటలు చూపారు – ఇంకో రెండు చిత్రీకరణ కావల్సి వుంది. 45 షూటింగ్ దినాలు తీసుకున్న ఈ చిత్రం జులై నెలాఖరుకి రెడీ అవుతుంది. పైట జారితే ఫరవాలేదు, కాలు జారితే...., ప్రేమ అంటే ఏమిటి?- ఈ రెండు పాటలూ (అన్నీ ఆత్రేయని) ఎంతో భావగర్భితంగా వుండటమేగాక, నటీనటులు కనబరిచిన భావముద్రికలు ఎంతో సందర్భోచితంగా వున్నాయి. నాగార్జున, కుష్బుల యుగళగీతాలూ, స్టెప్పూ నేటి గమనవేగానికి (స్పీడ్) అనుగుణంగా వున్నాయి. పాటల ప్రదర్శన అయాక, జగపతీవారి ఆఫీసులో దర్శక నిర్మాత రాజేంద్రప్రసాద్, పాత్రికేయులకి ఈ చిత్ర విశేషాలు తెలిపారు; యువహీరో నాగార్జున ఇష్టాగోష్టిలో పాల్గొన్నారు.... పిఆర్ఒ. నరసింహం

. . . . 29

మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ వారు, ఈ ఉదయం ఈగా థియేటర్‌లో, 1985 ఉత్తమ బహుమతుల జాబితా ప్రకటించారు. తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ, హిందీ చిత్రాలను, వేర్వేరు కమిటీల సభ్యులు పరిశీలించారు. తమిళానికి జస్టిస్ నటరాజన్, తెలుగుకి జస్టిస్ వెంకటస్వామి, కన్నడకు మిస్టర్ మోహన్, మళయాళానికి చంద్రచూడన్ ఐ ఏ యస్, హిందీకి జస్టిస్ సతారీ సయిద్ అధ్యక్షులు. తెలుగు కమిటీలో మద్రాసు కార్పొరేషన్ కమిషనర్ మాధవశర్మ ఐఎయస్‌తో బాటు పదిమంది వున్నారు. మొత్తం ఇరవై రెండు తెలుగు చిత్రాలు ప రి శీ లిం చా రు. 1 ఉత్తమచిత్రం - ప్రతిఘటన. 2 ప్రత్యేక ప్రశంస - షిర్డిసాయిబాబా, మయూరి 3 ఉత్తమ దర్శకులు సంగీతం శ్రీనివాసరావు - మయూరి 4 సంగీత దర్శకులు - బాలసుబ్రహ్మణ్యం- మయూరి 5 ఉత్తమ నటుడు - శోభన్‌బాబు 6 నటి - విజయశాంతి 7 ప్రత్యేక ప్రశంస - విజయచంద్ర, మురళీమోహన్, తులసి 8 కొత్త పరిచయం - సుధాచంద్రన్ 9 నేపథ్యగానం- బాలసుబ్రహ్మణ్యం, సుశీల..... తమిళంలో ఉత్తమచిత్రం- – సింధు భైరవి; దర్శకత్వం - బాలచందర్; నటుడు- శివకుమార్; నటి- సుహాసిని; సంగీతం - ఇళయ రాజా.... కన్నడలో ఉత్తమ చిత్రం: నీ భారత కాదంబరి; దర్శకులు - ద్వారకేష్; నటి - స ం ధ్య .... మళయాళంలో ఉత్తమ చిత్రం; తింగలచనల్ల దివసమ్; దర్శకత్వం - పద్మరాజన్; నటుడు- మమ్ముట్టి; నటి- శ్రీవిద్య... హిందీలో ఉత్తమ చిత్రం; రామ్ తేరీ గంగా మెయిలీ, దర్శకత్వం రాజ్ కపూర్; నటుడు- అమితాబచ్చన్; నటి -రతి .... సినీ ప్రపంచంలోని విశిష్ట వ్యక్తిగా భానుమతీ రామకృష్ణకు ప్రత్యేక అవార్డ్ యిస్తున్నారు ....

"సభ్యుల ప్రోత్సాహమూ, అదరణ ఈ సంస్థకు ఊపిరి. ఉత్తమాభిరుచులు కాపాడటానికే ఈ అసోసియేషన్ సర్వదా కృషి చేస్తున్నది. ఎవరిమెప్పు అభిలషించకుండా ప్రజామోదంతోనే యిది పటిష్టవంతమై, ముప్ఫయ్యేయి దేళ్లగా ఉన్నత ప్రమాణాలకై పాటు పడుతోంది"- అన్నారు అసోసియేషన్ అధ్యక్షులు జస్టిస్ మోహన్. సర్వమూ తానై ఈ సంస్థనెంతో జయప్రదంగా నిర్వహించుకొస్తున్న కార్యదర్శి అర్సి కన్నయ్య అభినందనీయులు.... సెప్టెం బరు పధ్నాలుగున మ్యూజిక్ అకాడమీ లో మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసి యేషన్‌వారి బహుమతి ప్రదానోత్సవం జరుగుతుంది.

## 1986 జూలై 01

ప్రసన్న ఆర్ట్స్ పేరిట "ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య", "తరం గిణి" చిత్రాలు (రెండూ దర్శకత్వం; కోడి రామకృష్ణ; నిర్మాత; ప్రతాప్ ఆర్ట్స్ రాఘవ) పంపిణీచేసి, సినీ వ్యా పార రహస్యం తెలుసుకొన్న కెళ్ల రామ స్వామి, 'కత్తులకొండయ్య' నిర్మించారు. ఆర్థికంగా అది గొప్ప విజయం సాధిం చకపోయినా, నష్టంకలిగించి వుండదు. దైవజ్ఞులు బేనర్ పేరు మార్చమన్నా రట – అంచేత, యిప్పుడది సౌభాగ్య లక్ష్మి క్రియేషన్స్ అయింది. కెళ్ల రామస్వామికి ఒక అబ్బాయి, ఇద్ద రమ్మాయిలు. అల్లుడూ, కుమారుడూ (రాంబాబు) తనూ ఈ కంపె నీలో పార్టనర్స్ .... చిత్రానికింకా పేరు పెట్టలేదు. కళ్యాణ చక్రవర్తి, రాజేంద్రప్రసాదూ నాయకులు. హీరో యిన్ ఎవరో యింకా నిశ్చయంకాలేదు. కథ, దర్శకత్వం: 'మౌళి'; సంగీతం: మహదేవన్. 'పాత్రికేయులు ప్రేక్షకు లకీ నిర్మాతకీ మధ్య, వారధి వంటి వారు. వారి కలానికి విలువ కట్టలేము. మా జయాపజయాలకు వారి సహకార మెంతో అవసరమవుతున్నది'- అన్నారు కెళ్ల రామస్వామి, తమ ఆఫీసులో జరిపిన గోష్టిలో .... పబ్లిక్ రిలేషన్స్ శ్రీకృష్ణ.

## . . . జులై 02

దాసరి నారాయణరావు శుభాశీస్సు లతో, అల్లు అరవింద్ శుభాకాంక్షలతో, బందెల ఈశ్వరరావు దర్శకత్వంలో, కళావాహినీ క్రియేషన్స్ వారి 'అణి ముత్యం' చిత్రానికి ఎ వి యమ్ 'సి' లో ఉదయం తొమ్మిది గంటలకు రికార్డింగ్ ముహూర్తం. శరత్ బాబు, రాధిక, రాజేంద్ర ప్రసాద్, అల్లు రామలిం గయ్య, రమాప్రభ ఈ పిక్చర్లో నటిస్తు న్నారు. నిర్మాతలు: వీరా రామకృష్ణ, ముత్తిరెడ్డి,ఆదినారాయణ,కమలహాసన్ 'స్వాతి ముత్యం'; ఇప్పుడు రాధిక 'అణి ముత్యం' .... పి ఆర్ ఒ: నరసింహం .... ఎవియమ్‌నుంచి విజయా డీలక్స్‌కి, సారథీ స్టుడియోస్ వారి 'జైలుపక్షి'. రికార్డింగ్ ముహూర్తం పదీ ఇరవైకి — నిర్మాత శశి భూషణ్ ఎంతో ఆద రంగా రిసీవ్ చేసుకున్నారు .... కలై మణి కథకు పరుచూరి బ్రదర్స్ మాటలు సమకూరుస్తున్నారు; నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి పాటలు రచిస్తున్నారు; మహదేవన్ సంగీతం, గోపాలరెడ్డి

కెమెరా. దర్శకత్వం: కోడి రామకృష్ణ. రాధిక, రాజశేఖర్, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, సుత్తివేలు, నిర్మల మున్నగు వారున్నారు .... ముక్కు పుడక, మంగమ్మ గారి మనవడు, పవిత్ర వంటి చిత్రాల మూల కథా రచయిత కలైమణి. ప్రస్తుతం ఈ 'జైలు పక్షి.' చిత్రాన్ని తెలుగు, తమిళ, కన్నడ హిందీ భాషలలో ఏక కాలమందు, నిర్మిస్తున్నారు. నూతన విలన్ కృష్ణా రావు పరిచయమవు తున్నాడు .... 'అమ్మల గన్న అమ్మ....', 'నేరం చేసిం దెవరో' ....నారాయణరెడ్డి రాసిన ఈ రెండు పాటలూ బాలు, సుశీల, శైలజలు పాడు తున్నారివాళ....పబ్లిక్ రిలేషన్స్: గీతా సుబ్బారావు

. . . . 5

పామ్‌గ్రోవ్ ఊర్వశిలో సాయి చంద్ నిర్మిస్తున్న 'ప్రళయం' ప్రెస్ మీట్. సహనిర్మాత: ప్రసాద్. హిమ ప్రళయమా, జలప్రళయమా, అగ్ని ప్రళయమా అన్న పశ్నకు. అలాటి దేమీకాదు రుద్రభూపతి జమీందారు యింట్లోని ప్రళయంఅన్నారునిర్మాతలు ఆ భూపతికి నలుగురు తనయులూ. ఒక తనయ (చిత్ర). ఈ అమ్మాయికి, సంగీతం మీద గల ఆసక్తి యింట్లో అలజడి లేవదీస్తుంది. .... వ్యాపార విలువలుగల ఈ చిత్రం తొందరలోనే విడుదల కానున్నదని చెప్పారు సాయి చంద్.

ఘర్మ గంగార్ఘురీ జ్ఞాన గోదావరి
సిక్త సహజీవనోదిత భారతభూమి
ఒక్కపరి హిమశిఖరి నెక్కి సేతువుదాక
దృక్కు సారించి పూరించు గళకాహళిక

—కృష్ణశాస్త్రి

బియ్యంతో వియ్యమందే పలుగురాళ్లు
పాలతో తాదాత్మ్యం చెందే పంపునీళ్లు
పట్ట పగలే గుచ్చుకుంటున్న చీకటిముళ్లు
పాలక వర్గాలలో పరిమళిస్తున్న కుళ్లు
అన్నీ నీ లీలలేనా దేవా.

—నారాయణరెడ్డి

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చినజాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏదిమార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

**ఇవిగాక**

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 - 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 7 – 50 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి - విజయవాడ-2


రాధామాధవ చిత్ర
శ్రీవేమన చరిత్ర
నిర్మాత
మండవ గోపాలకృష్ణ
సంగీతం సత్యం
దర్శకత్వం
సి.యస్.రావు B.A., Litt
ఫోటోగ్రఫీ: హరి అనుమోలు.

సురేష్ ప్రొడక్షన్స్ (ప్రై) లిమిటెడ్



# కలియుగ పాండవులు

డి. రామానాయుడు

కె. రాఘవేంద్రరావు B.A.

# సమీక్షలు

# చిత్రజగతి

## నవతా వారి 'సంసారం ఓ సంగీతం'

నవతా కృష్ణంరాజు నిర్మించిన ఈ పిక్చర్ పూర్తయి పది నెలలయింది; ఇన్నాళ్లూ అది వెలుగు చూడలేక పోయిందీ అంటే, తెలుగు సినిమా పరిశ్రమలోని అనారోగ్య పరిస్థితులే అందుకు కారణం.... అడుగడుగునా చంద్రమోహనో, పూర్ణిమో నవ్వు పువ్వులు వెదజల్లుతూ మనని వినో దింపజేసే ఈ రసవత్తర చిత్రానికి దర్శకులు రేలంగి నరసింహారావు. సత్యానంద్ సంభాషణలు బావున్నాయి. పరిస్థితుల ప్రభావంవల్ల ఏర్పడిన ఒక చిన్నమలుపుతో, ఈ వినోదాత్మక వరవడికి సీరియస్‌నెస్ అన్ని వైపులనుంచీ వస్తుంది. 'సంసారం ఓ సంగీతం - ఏదో ఒక చిన్న అప శృతి పలికినంత మాత్రాన తీగె తెంపేసుకుంటారా?' అనే సత్యాన్ని, మొహంమీద కొట్టినట్టు చెబుతుంది నిర్మల పాత్ర: ఈ మధ్య చాలా చిత్రాలలో ఆమె పాత్ర, పాతకొత్తల మేలు కలయికలా, ఒక అవిచ్ఛిన్న సంస్కృతీ ప్రవాహానికి ప్రతీకగా రూపు దాలుస్తోంది. ▌ అండాళ్ థియేటర్లోకి వెళ్లబోయేముందు, 'మీరొక కళాఖండం చూడబోవటం లేదు - సరదాగా వుండే సామాన్యమైన పిక్చర్ చూస్తారు' అన్నారు నవతా కృష్ణంరాజు నాతో నెమ్మదిగా, అది మెచ్చుకోదగ్గ నిజాయితీ. పిక్చర్‌లోని మూడు జంటలూ (చంద్ర మోహన్- విజయ) శరత్‌బాబు-స్వప్న, రాజేష్- పూర్ణిమ, పైకి సామాన్యంగా కనిపించినా, సామాజిక వాస్తవికతగలవీ లోతైన స్వభావం గలవీను. అంకెలలో అద్వితీయుడై ప్రతిదీ లెక్కలలో విడమరిచి చూపే మోహన (చంద్ర మోహన్), ఒక జీతంలో (ఎనిమిది వందలు) ముగ్గురం బతకడం కాదురా వెర్రినాగమ్మా - రెండు జీతాల్లో ముగ్గురం' అని బామ్మ (నిర్మల) చెప్పగా, శాంతితో (విజయశాంతి) పెళ్లికి వెంటనే వొప్పేసుకుంటాడు; గుడిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ చేసి, ఇద్దరం కలిసి దేవుడికి దణ్ణం పెడితే, మనం దంపతులమైనట్లే అని పరస్పర ఆత్మగౌరవాన్ని (సెల్ఫ్ రెస్‌పెక్ట్) విప్లవాత్మక భావ పటిమతో మామూలు మాటలలో చెబుతాడు. అలాగే నాట్యకారిణి (స్వప్న), (శరత్ బాబు) 'మీకు

జీవితం తెలుసు, ఎందరితోనో పంచుకొనివుంటారు; నాకు తెలియకపోలేదు బాయ్‌ఫ్రెండ్స్ వున్నారు.... నేను మీతో స్థిరపడదలుచుకున్నది మీ ఐశ్వర్యం చూసి కాదు. అవసరాలకి మించినంత డబ్బు నా దగ్గర వుంది.... జీవన పరిపూర్ణత కోసం, మాతృత్వానుభూతి కోసం, నాట్యకళకు వీడ్కోలు చెప్పి, మీకు ఇల్లాలినయేందుకు సమ్మతిస్తున్నాను.... పెళ్లి తంతు మీద నాకు నమ్మకం లేదు. నలుగురికీ చూపేందుకు ఈ మంగళ సూత్రం నా మెడలో వేయండి' - అంటుంది. నాట్యాన్ని, నాట్య ప్రపంచాన్ని వొదిలేసి, అతని గృహిణిగా బతుకుతుంది.... 'తనకి సంతానం కలగదనే విషయం రాజా మీకు చెప్పలేదా' - అని వారి ఫామిలీ డాక్టరు అడిగేసరికి ఆమె ఆశాసౌధం కూలిపోతుంది. నిజం చెప్పకుండా దాచి, తనని మభ్య పెడుతున్న రాజామీద కినుకగా ఉన్నప్పటికీ బయటపడదు... ఒక చలిరాత్రివేళ ఊటీలో, తమ కంపెనీలో పనిచేస్తున్న మోహనతో 'తప్పు' చేసే పరిస్థితులు సంభవిస్తాయి. తను తల్లిని కాబోతున్నానని రాజాకి చెబుతుంది; తండ్రి ఎవరో వెల్లడించదు. అతని పురుషాహంకారం దెబ్బ తిని, అన్వేషణ ప్రారంభిస్తాడు. తన ఉప్పుతింటున్న మోహన, తనకి ద్రోహం చేసినందుకు కుపితుడవుతాడు. 'ప్రెగ్నెన్సీ' టెర్మినేట్ చేయించుకోమని ఆమెని అడుగుతాడు; ఆమె వొప్పుకోదు; 'ఏ తాత్కాలికావేశం లోనో, అది జరిగిపోయింది -భ్రూణ హత్యకు నేను పాల్పడను' - అంటూ ఆమె అంతర్ధాన మవుతుంది... ఈ ఐశ్వర్యవంతుల వైరంలో లేగదూడల్లా నలిగిపోయినది మోహన, శాంతీను. ఏడాది బాబుకి తల్లి అయిన శాంతి, దాంపత్య న్యాయానికి భిన్నంగా తన భర్త మరొక స్త్రీతో గడిపాడు గనక విడాకులు కోరుతుంది; తనకాళ్లమీద తాను నిలబడాలనే నిశ్చయాని కొస్తుంది. 'ఇది తెలిసి చేసిన తప్పు కాదు' - అని మోహన ఎంత మొర పెట్టుకున్నా వినేవాళ్లు వుండరు. అయిదేళ్లు వచ్చేదాకానే పిల్లవాడిని తన దగ్గిర వుంచుకోవచ్చు; ఆ తర్వాత తండ్రికి వొప్పగించవలసి వుంటుంది - అనే విషయం లేడీ అడ్వకేట్ ముఖతా విన్నమీదట శాంతి మెత్త పడుతుంది; తనని కాపాడబోయిన మోహన, ప్రమాదానికి గురి అవడంతో, శాంతి కళ్లు తెరుపులకి వస్తాయి... చంద్రమోహన్, విజయశాంతి, శరత్‌బాబు - వీరికివి చిర పరిచిత పాత్రలు. పూర్ణిమ తన హాస్య కుసుమ పరాగంతో ప్రేక్షకులని అలరిస్తుంది. 'వయసు చేసే తొలి వందనం' కదన కుతూహలలో మెప్పించిన స్వప్న, తన పాత్రని ఎంతో డిగ్నిఫైడ్‌గా పోషించింది. అందరూ బాగా చేశారు. పాటలు సుశ్రావ్యంగా వున్నాయి. సామాజిక యితివృత్తంతో కథాబలం గల ఈ చిత్రాన్ని దర్శకులు రేలంగి నరసింహారావు చక్కగా రూపొందించారు. నిర్మాణత: అచ్యుతరామరాజు.

## జె ఎస్ కె వారి 'ఆది దంపతులు'

పది పన్నెండేళ్ళ అమ్మాయికి మరణయ్య మీద వున్న తల్లి, తమ్ముడు చెల్లెలాతోపాటు తమ యింట్లో పెరుగుతున్న అనాథ బాలుని కూడా వొప్పజెబుతుంది. పెదవాడు (నాగేశ్వరరావు) ఇద్దరు తమ్ముళ్లా (చంద్రమోహన్, నరేష్) చెల్లెలు (పూర్ణిమ) కోసం, వెండి తెర హీరో చేయవలసిన పార్టు టైమ్ జాబ్స్ అన్నీ, బూట్ పాలిష్ ప్రెస్‌లో మిషన్‌బాయ్ యిత్యాదులు, చేసి, నెలకు ఆరువందలు తెచ్చుకొనే ప్రెస్ కంపోజిటరై, తమ్ముళ్లిద్దరినీ పొరుగూరులో పెద్ద చదువులు చదివిస్తూ, పార్వతిని (జయసుధ) కట్టుకు ఒక యింటివాడై, - ఆ పార్వతి కూడా తల్లీ తోడూ లేని ఒంటరిది- సంసార మీదుతూ వుంటాడు. నెలకు ఆరు వందలు సంపాదించే కంపోజిటర్, నాలుగువేల రూపాయిలు చేసే డైనింగ్ టేబుల్ ముందు కూచుని రుచి పాకాలు మాట్లాడటం తెలుగు సినిమాల్లోనే సాధ్యం. ఎంత పెద్ద డైనింగ్ రూమో అని అనిపించక మానదు. ఇక, త్యాగాల పర్వం. నెల తప్పిన పార్వతి, మరుదుల క్షేమం ఆలోచించి, తన కడుపున పుట్టిన బిడ్డ కారణంగా తనలో స్వార్థం ఏర్పడకుండా వుండేందుకు, యబార్షన్ చేయించుకుంటుంది; తను తండ్రి నవుతున్నాననే సంతోషంతో తోటి వర్కర్లకు మిఠాయిలు పంచిపెట్టిన శంకరం, మొదట్లో విస్తుపోయినా, [illegible] తన భార్యలోని ఔన్నత్యం తెలుసుకుంటాడు. పట్నంలో చదువుకుంటున్న పెద్ద తమ్ముని (చంద్రమోహన్) వెంట పడుతుంది ఉమ (తులసి) అనే భాగ్యవంతులమ్మాయి; వారికి పెళ్లవుతుంది; శంకరం పనిచేసే ప్రింటింగ్ ప్రెస్‌కి యజమాని అవుతాడతడు. అన్నగారు కార్మికులపక్షం; తమ్ముడు అన్నగారి పక్షం. ఈ డబ్బంతా అత్తవారిదవటం వల్ల, తమ్ముడికి మరదలుకే చేసే .... చెల్లెలు పెళ్లికి లక్షా ముప్ఫయి వేలు ప్రావిడెంట్ ఫండ్ తీసుకు, ఆ సంచీ కాస్తా విలన్ (గొల్లపూడి మారుతీ రావు) యింట జారవిడుస్తాడు - శంకరం. ఇతను ఎన్నేళ్లు ఉద్యోగం చేశాడో, చెల్లెలికి ఎన్నోఏట పెళ్లి చేశాడో మరి.... "ఏమైతేనేం, శంకరాన్ని పోలీసులు పట్టుకుపోతారు - విలన్ బనాయించిన అబద్ధపు కేసు వల్ల. పూర్తిగా చితికిపోయిన ఈ ఆది దంపతులు మళ్లీ త్యాగాలు మొదలుపెడతారు - ఓ హెన్రీ కథని గుర్తు చేస్తూ! అతను కళ్లజోడు అమ్మి మందులుతెస్తే, ఈమె చేయిచాచి ఎరుగని చేతితో బిచ్చమెత్తి కళ్లజోడు కొంటుంది. ఈమె ఆపరేషన్‌కి కావల్సిన అయిదు వేలకీ, 'హరిశ్చంద్ర' లోని కాటికాపరి సీను ఏకపాత్రాభినయం చేస్తాడు శంకరం. అతను రక్తం కక్కుకొనీ, ఈమె నేల కొరిగీ మరణిస్తారు. ఇంతకీ ఈ 'ఆది దంపతులు' ఏం చెప్పదలుచుకున్నారో బోధపడదు. వారి జీవితాలు జాలికరంగా పరిణమించిన మాట నిజమే - మన

కుటుంబాలలో ఇంటికైన పెద్దవాడు అనుభవించే అవస్థే అది. అయితే, శంకరం పాత్ర పట్ల ఎటువంటి స్పందనా కలగదు; అతను చేతగానివాడూ కాదు, తెలిసిన వాడూ కాదు. ఇక జయసుధ పాత్ర స్త్రీ జనావళిని బాగా ఆకట్టుకుంటుంది - ఆమె పాత్రపోషణ కూడా ఎంతో స్వాభావికంగా, లలితంగా, కరుణ రసపూరితంగా ఉంది .... అక్కడక్కడ తళుకులే తప్ప మొత్తం మీద ఒక ఆకృతి లేదు. దర్శకత్వం: దాసరి నారాయణరావు. నిర్మాత : నిథిన్ కపూర్

## సృజనా వారి 'అనుపమ'

మధు, పీటర్ ఒకే వృత్తికి చెందిన జేబుదొంగలు, గాఢ స్నేహితులు. యమ్ ఎ చదువుతున్న అనుపమ, బ్యాంకునుంచి డ్రా చేసిన వందరూపాయిల నోట్లు బాగ్‌లో పెట్టుకొని వస్తూండగా, ఈ తోడు దొంగల్లో పీటర్, మూర్ఛరోగం నటిస్తూ, రోడ్డు కడ్డంగా పడిపోతాడు; రెండోవాడు ఆ సందడిలో ఈమె బాగ్ కైంకర్యం చేస్తాడు. అయితే, యింటి కెళ్లాక ఈ మధుకి (ప్రతాప్ పోతన్), మూర్ఛ రోగి చేతిలో పెట్టేందుకు బాగ్‌లో నుంచి తాళం చెవులు తీసి, ఎంతో నమ్మకంగా ఈ బాగ్ తనకిచ్చింది ఆ అమ్మాయి, అంత అమాయకంగా నమ్మిన మంచిమనసుని వంచన చేయుట మహాపాపమని,డబ్బంతటితో ఆ బాగ్ ఆ కన్యకామణికి యిచ్చేస్తానంటాడు. 'నీ సగం యిచ్చుకో' అని పలికిన పీటర్, పసివాడు ప్రేమలో పడ్డాడని జాలి చెంది, మొత్తం డబ్బు వాపసు చేయటానికి అంగీకరించడమే గాక, ఆ గర్ల్ ఫ్రెండ్‌ని పిక్‌నిక్‌కి తీసుకెళ్ళేందుకు ఈ మధు వద్ద పైసా లేకపోతే, ఒక విషణ్ణ హృదయానికి కట్టుకథతో, పదిరూపాయిల బైబిలు మూడు వందలకి అమ్మి, ఆ డబ్బు తీసుకొచ్చి యిస్తాడు - అలాంటి స్నేహం వారిది. మధూ అనుపమల ప్రేమ (ప్రతాప్ పోతన్ - సుహాసిని) ఆనాటికానాడు గట్టిపడి, అంకుల్ అనుమతితో పెళ్లాడే పరిస్థితికి వస్తుంది. తమ క్లాత్ షాపులో డ్రెస్సులు కాజేసిన ఈ నయవంచకుని టోపీలో తన మేనగోడలు ఎలా పడిందా అని విస్తుపోతాడా అంకుల్; గెటవుట్ – అంటాడు మధుని. తను ప్రేమించినవాణ్ణి మార్చుకు, మంచివాణ్ణి చేసుకొనే భారం తనది - అంటుంది నవయుగ ప్రేయసి అనుపమ... పీటర్‌కి నిజంగానే మూర్ఛరోగం వచ్చి యాక్సిడెంటై చావు బతుకులమధ్య ఉంటాడు. ప్రియసఖికి యిచ్చిన వాగ్దానం ఉల్లంఘిస్తూ, ప్రాణమిత్రుని కాపాడేందుకు దొంగతనం చేస్తాడు మధు. అయితే, ఇటు మిత్రుడూ దక్కడు, అటు ప్రేమా దక్కకుండా పోతుంది. క్లిష్ట పరిస్థితులు ప్రియురాలికి విన్నవించి, మారిన మనిషిగా, ప్రయోజకునిగా, గౌరవనీయునిగా ముఖం చూపిస్తానంటాడు. సినిమాలో గనక యిదంతా కొన్ని నెలల వ్యవధిలో టకటకా జరిగి

పోతుంది - ట్రెడిల్‌మాన్ నుంచి కాఫీ పవుడర్ కంపెనీకి ఏరియా మేనేజరవు తాడు. యార్కాడ్‌లో మళ్లీ అందరూ తటస్థపడతారు. అన్యాక్రాంతమైన అనుపమ మనసు కోసం మరొక యువ కుడు ఆరాటపడుతూంటాడు. అయితే ప్రేమ జయించాలి గనక ఈ ప్రేయసీ ప్రియులు కలుసుకుంటారు. అంకుల్ ఒక చిన్న మెలిక వేయడంతో ఆత్మా ర్పణకు పాల్పడ్డ మధు, అనుపమ ఒళ్లో కన్ను మూస్తాడు. ఈమె మిస్ అనుపమగానే మిగిలిపోతుంది.... సుహాసిని తన పాత్రకు వన్నె చిన్నెలూ సౌకుమార్యమూ సమ కూర్చింది - ఈ పురుష ప్రపంచంలో అతివ మనసూ మమతా ఎలా నలిగి పోతాయో ఆర్ద్రతతో చూపింది. ప్రతాప్ పోతన్ తన ఆవేదననీ పరి వర్తననీ గంభీరంగా చూపాడు. కన్నె మనసులోని కమనీయ భావాలు ఒక్కోసారి కన్నీళ్లలో కరిగిపోవడమే ఈ చిత్ర కథాంశం (ప్రెస్ షో అయాక జనార్దనరెడ్డి పాత్రికేయులకు గిఫ్ట్ పాకెట్స్ అందజేశారు - ఒక జత స్టీల్ కప్స్ అండ్ సాసర్స్ మూతలతో) నిర్మాత: పి రాజేశ్వరి.

## జయభేరీ వారి 'కర్పూర దీపం'

కుండపోతగా వర్షం పడుతున్న ప్పుడు కారు ఆపి, తనచెల్లెలు ఫ్రెండూ, తమ యింటికి ఎన్నోసార్లు వచ్చిందీ అయిన ఆ అమ్మాయిని, యింటి దగ్గిర డ్రాప్ వేస్తాను, కారెక్కమం టాడు. తన చిత్రపటం వేసినతనూ, మహాలక్ష్మిలా వున్నావని తనని మెచ్చు కున్న తనూ అయిన ఆమనిషి మీద పూర్తి నమ్మకంతో, బాక్‌సీటులో కూచుంటుంది ఆ కాలేజీగరల్. బయట హోరున వర్షం. నడిదారిలో కారు ఆగిపోతుంది. 'డెల్కో' లోకి నీరువెళ్లిం దని అతను సంజాయిషీ చెప్పి, బాగు చేసేందుకు ఆ వర్షంలో బయటికెళ్లి తడిసి, బాక్‌సీట్లోకి వచ్చి ఆమె పక్కని కూచుంటాడు - సిగరెట్‌ముట్టిస్తాడు- గ్లాసు విండోస్ (కారువి) నాలుగూ మూసి వున్నాయి. పక్కనున్న అమ్మా యికి ఈ పొగ పడుతుందో లేదో అనే యింగితం కూడా లేకుండా సిగరెట్ ముట్టిస్తాడు. వెనకటి సన్నివేశాలలో యితని చూపులలో కాంక్ష కనబడ్డప్ప టికీ, నమ్మి కారెక్కిన అమ్మాయిపై, యిటువంటి అత్యాచారమూ బలాత్కా రమూ జరుపుతాడని అనుకోము. కిషోర్ (మురళీమోహన్) ఎంత మంచి వాడో, అతని మొదటి భార్య హార్ట్ పేషంట్ అయిన కారణంగా ఒకసారి కూడా ఆమెని తాకకపోవడం, ఏడాది అయాక ఆమె చనిపోతే ఆమెనే తలుచు కుంటూ యితను ఒంటరి జీవితం గడ పడం,యిలాటివన్నీ అతని తరఫునడాక్టర్ ఫ్రెండ్ వకల్తా పుచ్చుకు చెప్పినప్పటికీ ఇతను చేసిన నేరం, రాక్షస కృత్యం .... సమర్థనీయం కావు.... బావ (శరత్ బాబు), మరదలు (సుహాసిని) అన్యో న్యం ప్రేమించుకున్నారు; ఒకరికొకరు అంకితమయారు; శ్రావణ మాసంలో పెళ్లి ముహూర్తాలు పెడతారు; బావ

తండ్రి (సత్యనారాయణ) పకపక నవ్వుతూ పరలోక గతుడవడంతో, ఆ బావ తిరిగి అమెరికా వెళ్లిపోవలసి వస్తుంది - సంవత్సరీకాలు గాకుండా పెళ్ళికి మన సంప్రదాయం ఒప్పదు గనక శుభముహూర్తం వాయిదా పడుతుంది .... రెండేళ్లయాక అతను తిరిగొచ్చేసరికి ఈమె పిల్ల తల్లిగా వర్కింగ్ వుమెన్స్ హాస్టల్‌లో కనిపిస్తుంది.... తన కారణంగా మాతృత్వం వహించిన యువతికి, సంఘంలో గౌరవస్థానం ఒనగూర్చి, భార్యగా చేసుకుంటానంటాడు కిషోర్. జీవితం సర్వనాశనం చేసిన వ్యక్తిని క్షమించలేనంటుంది ఆ యువతి.... హీరోయిన్ వెలిబుచ్చిన అభిప్రాయాలలోను, ఆమె మనుగడలోను, ఆత్మస్థైర్యంలోను, స్వతంత్ర జీవనంలోను ప్రగతిశీలక దృక్పథం లేకపోలేదు; చివరిలో బావని అడుగుతుంది: 'ఈ పురుషుల యిష్టానిష్టాలు, వారి కోరికలు, వారి సులువు బలువులు, వారి మార్గమే తప్ప, మాకంటూ వ్యక్తిత్వం లేదా? మా కంటూ మనసులూ అభిరుచులూ లేవా? ఎంతకీ మీ దృష్టి మీ సౌకర్యాలే తప్ప, మా కోరికలకు అభిప్రాయాలకు విలువలేదా?' — అని .... చివరికవి చిలక పలుకులు గానే మిగిలిపోతాయి. వంచకునికి భార్య గావడం బానిసత్వమని తెగబడి చెప్పిన యువతి, మగవాళ్లు అల్లిన పరిస్థితుల వలలో, బానిస అయేందుకు ఓటమితో అంగీకరిస్తుంది. .... అమెరికా నుంచి వచ్చిన బావ, ఈ అవివా

## క్షమాపాత్ర

క్షమించు
ఇదె నా అశక్తత!
కామం రగులుతున్న ఆ కళ్లకు
ప్రేమపాత్ర అందుతుందని ఎలా
అనుకుంటాను?

కాలనాగులు బుసలు కొడుతున్న
ఆ నవ్వులకు స్నేహ పాత్ర అందు-
తుందని ఎలా అనుకుంటాను?
ముళ్లు వికసించిన ఆ మాటలకు
ఆదరపాత్ర అందుతుందని ఎలా
అనుకుంటాను?

శూన్యం ఆభరణమైన ఆ హస్తాలకు
సత్ఫలపాత్ర అందుతుందని ఎలా
అనుకుంటాను?

సోమరితనం సంకెలలో ఒరుసు
కొనే ఆ వూహకు - సుమపాత్ర
అందుతుందని ఎలా అను
కుంటాను?

ఆ విషపాత్ర నిజంగా
మధుపాత్ర అవుతుందని
ఎలా అనుకుంటాను?

అందుకే - నీ కళ్లలోని
ఆ క్షమాపాత్రని అడుగుతున్నాను!
నాకు దానం చెయ్యి!
నేను దోషాల్ని పానం చేస్తాను
నీ కోరిక తీరుస్తాను
ఒక నిశ్శబ్ద తీరాన్నై నిలుస్తాను!

—ఆచార్య తిరుమల

హితమాతను పెళ్లి చేసుకు, బాబినీ ఆమెనీ తన వెంట అమెరికా తీసుకు వెళ్తేనే, ఈ కథకు బిగువూ, న్యాయమూను: ఆ కథానాయిక పాత్రకు జీవమూ స్పందనాను .... 'కర్పూర దీపం' అనే పేరుకి తగ్గట్టుగా లేదు కథా సంవిధానం. మురళీమోహన్, శరత్‌బాబు, సుహాసినీ ముగ్గురూ తమ పాత్రలకు న్యాయం చేకూ: రాజరాజేశ్వరి - లా (ముచ్చెర్ల అరుణ - పిఠలేఖ సుధాకర్) పాత్రను పోషించి. శ్రావణ (ని త్రిల) చెప్పుడు కొంచెం మోతాదు ఎక్కువ యింది .... దర్శకత్వం : చంద్ర. నిర్వహణ : కిషోర్.



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది : 10-9-1986.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

దృక్పోవడ మెలా?

# జీవన మార్గం

## ఎలినార్ రూజ్ వెల్ట్

ఇరవైఏళ్ల క్రితం యన్నార్ చందూర్ 'యులెర్న్ బైలివింగ్' ('You Learn by Living') అనే ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేశారు. ఇప్పుడా పుస్తకం కాపీలు ఎక్కడా దొరకవు. ఎలినార్ రూజ్వెల్ట్ శతజయంతి సందర్భంగా ఆ అపూర్వ గ్రంథంలోని కొన్ని భాగాలు ప్రచురిస్తున్నాము.

ఎవరు సన్నిహితులనిపిస్తారో, అటు వంటివారిని ఎన్నుకోడం జీవన పురోగమనానికి ముఖ్య బాట. మన అనుభవం విస్తరించిన కొద్దీ, మన కేర్పడే పరిచయాలూ స్నేహాలూ కూడా వృద్ధి చెందుతాయి. మన దృక్పథాన్ని బట్టే మనచుట్టూ మనుషులు ఏర్పడు. తున్నారు; మన మనుషులన్నవారు.

♦ ♦ ♦

ఆ తరువాత ముఖ్యవిషయం 'నేను ఏది నమ్ముతున్నాను' అనేది. నా నమ్మకాల ప్రకారం నేను జీవించగలనా? ఇది నా నమ్మకంసుమా అని నలుగురితోటి అనగలనా? నా విశ్వాసానికి ఏవిధంగా ప్రాణం పోయగలను? పదిమందీ ఏమన్నా అనుకొంటారేమోనని, గౌరవానికి భంగకరమనీ, నా విశ్వాసానికి తిలోదకాలిచ్చి నలుగురిలో ఒకడినై పోతానా? వ్యాపారం దెబ్బతిన్నా వుద్యోగానికి మొప్పం వొస్తుందని భీతి గలిగినా, నేను నమ్మిన విశ్వాస ప్రకారం జీవించగలనా? అందుకు తగ్గ ఆత్మస్థయిర్యం నాకున్నదా?– అని ప్రశ్నించుకోవాలి.

ఈ రోజుల్లో మౌఢ్యమనేది ఏదో ఒక రూపాన సంఘ జీవనంలో చీడ పురుగై వుంటోంది. వేర్వేరు రంగులు కానీయండి, ఒకరుమరొకరని మూఢత్వ కారణంగా కించపరచడం జరుగుతోంది. సిద్ధాంతరీత్యా మీరు ఆ మౌఢ్యాన్ని ఆమోదించలేరు. కాని సంఘంలో అది విస్పష్టంగా కనపడుతున్నపుడు, మీరు దానిని నివారించేందుకు ఏం చేయకలుగుతున్నారు? నలుగురూ ఏమన్నా అనుకుంటారు. మన కేల, అని మీరు తప్పించుకు తిరుగుతున్నారా లేక మీరు నమ్మిన సిద్ధాంతానికి, ఆ విశ్వాసానికి ప్రాణంపోసే నిమిత్తం మీవ్యక్తిగత ప్రవర్తనకి మీరు బాధ్యత వహిస్తున్నారా?

కొన్ని సంవత్సరాల క్రితం ఒక యువక దంపతులు, ధనమూ పలుకుబడీ వున్నవారు, ఒక నూతన ప్రదేశానికి వచ్చారు. ఈ యువదంపతులకి ఆ వూళ్లో వారు కొత్త, కాని సాంఘికంగా ... కే [illegible] చెందిన తమ



కుడి ఎడమల 'రావు' గల రావు గోపాలరావు, వేదికమీద, రంగస్థలం మీద సమాన ప్రతిభగల రావుగోపాల రావు, రాజ్యసభకు ఎన్నికైన సంద ర్భంగా 'కళాసాగర్' వారు రాణీ సీతయ్ హోటల్లో (15-7-1986) ఆయనని సత్కరించారు. డా॥ లత 'ఇదీ నాకథ' - ప్రజ్వలీ పబ్లికేషన్స్ వారి ప్రచురణని - ఆయన రిలీజ్ చేశారు.



సమానస్థులతో వారు స్నేహం చేసు కున్నారు.

ఒకరోజు సాయంత్రం పార్టీ జరుగు తూండగా, సంభాషణ ఆవూరు కొత్తగా వచ్చిన నీగ్రో ఫాదరీ వైపుగా వెళ్ళింది. ఆ వూళ్లోని పౌరులందరూ తెల్లవారు ఇటువంటి ప్రదేశానికి నీగ్రో ఫాదరీ రావడమేమిటి? ఆ పంపేవారు ఎలా పంపారు అని యీ తెల్లవారికి కొంచెం కంటకంగా వుంది. పార్టీ యిస్తున్న వారూ, పార్టీకి వచ్చినవారూ కూడా యిది చాలా దారుణం, అమానుషం, చాలా అప్రదిష్టకరమైన విషయం అని వ్యాఖ్యానించ సాగారు.

నేను చెప్పిన యువదంపతులు నిశ్చేష్టులయారు. వారు ఆ వూరికి కొత్తగా వచ్చినవారు. ఇరుగుపొరుగు తో చెలిమి చేసుకోవలసినవారు. ఈ యువక దంపతులని ఎవరూ మీ అభి ప్రాయమేమిటని అడగలేదు. అంచేత నిజానికి వారు చెప్పనవసరం లేదు. నిశ్శబ్దంగా వూరుకుంటే చాలు. కాని వారు అలా వూరుకున్నారా?

ఊరుకోలేదు. ఆ యువక దంపతు లకి ధైర్యమూ ఆత్మవిశ్వాసమూ వున్నాయి. ఇద్దరూ ఒకరినొకరు చూపులతో పల్కరించుకు కుర్చీలో నించి లేచారు.

వారు ఇలా అన్నారు. 'మీ మీద మాకేమీ కోపంలేదు. మీరంటే మాకు చాలా యిష్టం. కాని యీ అసహ్యాకర మైన మాటలూ, ద్వేష ప్రకోపమూ మాకు కొంచెం బాధావహంగా వుంది. అంచేత వెళ్ళిపోతున్నాము.'

పార్టీలో వారందరూ కొంచెంసేపు ఆశ్చర్య పోయారు. మొదట కొంచెం సేపు వీరిని వేళాకోళం చేశారు. కాని కాలక్రమేణా యీ యువక దంపతుల పై వారికి గౌరవభావం ఏర్పడింది. మీరు ప్రజలలోని మౌఢ్యాన్ని పోగొట్ట లేకపోవచ్చు, కనీసం ఆ మౌఢ్యానికి బయట నిలబడి, 'ఇది తప్పు సుమా'

అని చూపగలుగుతున్నారు. మొదట్లో ఊళ్ళోవారికి యిది బాగుండక పోయినా, తరువాత తరువాత ఆ యువ దంపతుల ఆత్మ విశ్వాసానికి గౌరవం ప్రకటించారు. మాధ్యానికి సంబంధించిన ం కాలగతిలో కలిసిపోయి, వ్యక్తులుగా రి విలువ నిర్ణయమయింది.

రష్యన్‌లు తమ పిల్లలని పెంచడంలో శిక్షణకే ప్రాధాన్యత యిస్తారు తప్ప పిల్లల అభిరుచులకి ఆస్కారం లేదు. నామమాత్రంగా వారికి కొన్ని అవకాశాలు వొదుల్తారు గాని అవి అతి స్వల్పములూ అర్థరహితములూను. ఇక అమెరికాలో పిల్లల విషయంమంటూరా, యిందుకు పూర్తిగా విరుద్ధం. స్వాతంత్ర్యావకాశాలు అమితమవడంవల్ల వారు విచ్చలవిడిగా వ్యవహరించడం తప్ప, శిక్షణ అనేదానిని పూర్తిగా కోలుపోతున్నారు. ఈ శిక్షణారహితులు తమ వయసువారి మధ్యా పెద్దల మధ్యా కూడా చికాకు కలిగే పనులు చేస్తున్నారు.

పిల్లల శిక్షణ విషయం యిలా స్థూలంగా చెప్పివేయడం సబబుకాదు. కాని అమెరికాలోని పిల్లలు బయట శిక్షణవల్ల తమ స్వభావాన్ని మార్చుకోవలసిన అవసరం ఎంతైనా కనబడుతోంది. వెలుపలినుంచివచ్చే యీ శిక్షణ ద్వారాగాని వారికి ఆత్మశిక్షణ, బాధ్యతాభావమూ కలగవు. పిల్లలకిచ్చే స్వాతంత్ర్య మెప్పుడూ కొన్ని పరిమితులకి లోనై నియమానుసారం



విజయనిర్మల దర్శకత్వంలో ఎస్ పి కంబైన్స్ వారి 'పగసాధిస్తా'లో నరేష్ చూపులలోని ఆలోచనలేమిటో!

వుండాలే తప్ప, విశృంఖలం కాకూడదు. బాలబాలికలలో బాధ్యతా లక్షణము పెరిగిన కొద్దీ పెద్దవారి కట్టుళ్ళు కొంత తగ్గిస్తూ వుండవచ్చు.

ప్రపంచం మొత్తంమీద ముఖ్యంగా అమెరికాలో నేటి యువతీ యువకులలో కొంచెం నిర్బాధ్యత కనిపిస్తోంది. ముఖ్యంగా మోటారు స్టీరింగ్ ముందు కూచున్న మనిషిని తీసుకోండి. వేగానికి సంబంధించిన నియమాలూ, డ్రయివ్ చేస్తున్నపుడు పాటించవలసిన నియమాలూ కొన్ని వున్నాయని యువకులు విస్మరిస్తున్నారు. స్టీరింగ్ వద్ద కూచోగానే ఎంత వేగంగా కారుని

పోనిస్తే, అంత ఘనత అని అనుకోడమే తప ఆ ఏక్సిలరేటర్ నొక్కడమే ఏదో అద్భుతమైన బుద్ధి విశేషంలా, బార్‌లో డ్రింక్ తీసుకొని, నిర్బాధ్యతా యుతంగా కారులు నడిపే యువకులని చూస్తే, 'మనం ఎక్కడికి వెళ్తున్నాం?' అనే విచారం కలుగుతుంది. వీరు తమ బాధ్యతను గుర్తించరు. అదేవిధంగా సాయంత్రం యింటికొచ్చేసరికి, పిల్లలు చేసిన అల్లరంతా ఒక పట్టీగా సమ కూర్చి, 'యీ పిల్లలని నేను దార్లో పెట్ట లేకుండా వున్నాను' అని భర్తని వేధించే యిల్లాలు కూడా ఒకవిధంగా తన బాధ్యతని విస్మరిస్తోంది.

ఏపనికి ఎటువంటి ఫలితమోనని, ఫలితానికి జంకుతూ ఏపనీ చేయక స్తబ్దుగావుండే మనిషి, చివరకు అన్నిటి లోనూ వెనకబడిపోతాడు. తను వెనక వుండి, బాధ్యత మరొకరిపై వేయడం సుఖమనుకుంటాడు. ఎవరికివారు నిశ్చ యించుకోవలసిన సందర్భంలో ఆ నిశ్చయం చేసుకునే ధైర్యంలేక, పరి స్థితుల మీదనో యితరుల మీదనో ఆధారపడేవారు, పూర్ణ వ్యక్తులు కానే రరు. నిశ్చయమనగానే అది మొండి తనం కాదు. హేతుబద్ధమయిన కార్యా చరణ. మనం ముందుకు నడుస్తున్న పుడు అనుకోనివి అనేకం ఎదురవు తాయి. వాటికి అనుగుణంగా మన అడుగు మార్చాలి. నిశ్చయమనునది ఎపుడూ మూర్ఖత్వమూ మొండితనమూ గాక సచేతనమగు కార్యవాదిత్వమవు తోంది.

తను ప్రస్తుతం వున్న వుద్యోగంలో తనకి సుఖంగా వుండటం లేదని, మనసు మార్చుకు, మరొకదారితొక్కే

## [illegible]

అతని కళ్ళలోని వై
మన వేదనాగీతి అవుతోంది.

ఈ కాలి గజ్జల శబ్దం ఎక్కువైన కొద్దీ నేను కుంగిపోతున్నాను

ఈ స్పందన నా గుండెది -దానిని శాంతింపజేయటం నావల్ల నయేపనా?

వెలుగులు చిమ్మేది నా గుండెల్లోని దీపం - దానిని ఎలా దాచాలో తెలియడం లేదు.

ప్రణయినీ, నా గుండెల్లోని కాంక్షే నీ పాదాలకు ఆ గులాబీ రంగు మిస మిసలనిస్తోంది.

సాగర కెరటాలు కంఠసీమని చుం బిస్తూ చెవులు కొరుకుతాయి.

పాత్రలోకి గోక్షీరాన్ని పితుకు తున్నావు - ఖాళీగ్లాసు పుచ్చుకు పక్కన నిలబడ్డాను.

మర్చిపోతాను - నాకు మరుపె క్కువ - నేను ఒంటరిగా నివసించే ఈ ఏకాంత గృహ ద్వారాలు బంధిత ములు.

చేతులు ఒకటి నొకటి పట్టుకుం టాయి; చూపులు ఒకదానిలో కొకటి చూసుకుంటాయి - ఆ తర్వాత ప్రారంభమయేదే హృదయగానం.

ఆత్మసఖికోసం అర్ధరాత్రి నేను వెళ్తున్నప్పుడు, పక్షులు పాడవు, గాలి సవ్వడి చేయదు; ఇరువైపులనున్న ఇళ్లు నిశ్శబ్దంలో మునిగివుంటాయి.

—టాగూర్

యువకులు కొంచెం సాహసవంతులు. మనం తెగనాడిపోయనక్కర్లేదు. అలా అని ప్రతివారూ తమ వృత్తులూ వుద్యోగాలూ ఎప్పటికప్పుడు మారుస్తుంటే కుదరదు. ఇలా అటా అనిపించినప్పుడు, తగు పరిశీలనతో ఒక మార్గం ఏరుకున్నాక, ఆ మార్గం వెంట నడవడమే శిక్షణ అవుతోంది. మనకి అక్కర లేని వాన్ని, ముందే యిది మనదికాదు, అని పక్కకి నెట్టివేయవచ్చు. ఒకవేళ పొరబాటున తప్పటడుగు పడినా, అది తెలుసుకు, తప్పుదారినుంచి మీకని నిర్ణయింపబడ్డ బాటపైకి రాగలగాలి.

మనకి వోటమి ఎదురైనపుడు, మనం చేసినది తప్పు అయినప్పుడు, 'చుట్టూవాళ్ళు సరిగా చేయలేదు. నా శక్తికి మించినపని చేయమంటే ఎలా?' అని యీ ప్రకారం మనని మనం సరిపెట్టుకునేందుకు చూస్తాం. అలా నేను చేసి వుండకూడదు, పొరబడ్డాను, అని సగర్వంగా వొప్పుకునేందుకు నిజాయితీ, ధైర్యం, బాధ్యతని ఆమోదించే స్వభావమూ మీలో వుండి వుండాలి. లేకపోతే వొప్పుకోలేరు.

మన పొరబాట్లెప్పుడూ, ముందు ముందు మార్గదర్శకములై, అనుభవ గ్రంధంలో పుటలుగా, భావించుకోగలిగినప్పుడు, జీవితంనుంచి నిజమైన సారం గ్రహిస్తున్నామన్నమాట. అపజయాన్ని విజయసోపానంగా భావించుకోవడం అందరికీ చేతకాదు. మనము ఎంత వుత్తమశిక్షణ పొందినప్పటికీ వివిధమార్గాలు మనకి తరుచు తటస్థపడుతూంటాయి. అటువంటప్పుడు మనం, మన దారి ఏదో మనం ఎన్నుకు, ముందుకు సాగాలి.

బాలబాలికలూ యువతీ యువకులూ యింత బాధ్యతని తమ బుజాలపై ఎలావేసుకోగలరు? - అంటారు కొందరు. మన ఎన్నికలన్నీ కడపటి నిర్ణయాలవడం లేదు. కొన్నిటిని ముందు ఎన్నుకు, ఆ పైన కాదను కొంటున్నాము. అది వద్దనుకొని, మరొకటి కోరుకొంటున్నాము. మీ ఎన్నిక పొరబాటైనంత మాత్రాన కొంప మునగదు. కాని ఎటూ ఎన్నిక లేక, కాలగమనంతో కొట్టుకుపోదామనుకుంటేనే, మీరేమిటో మీకూ తెలియదు, లోకానికీ తెలియదు. అంచేత యువతీ యువకులూ బాలబాలికలూ చేసే ఎన్నికలు విశుద్ధమైనవిగా వుండటం లేదని అరాటపడకండి.

చిన్నపిల్లలకి ప్రతికథలోనూ, ఆ కథ చివరికి సుఖాంతముగా వుండాలని పిస్తుంది. అదే నేటి యువతీ యువకులలో కూడా కనపడుతుంది. 'ఆ తరువాత వారు అనేక సంవత్సరాలు సుఖంగా జీవించారు' అని కథ అంతమవుతుంది. అటువంటి విశిష్ట జీవనము, మార్గాలు ఎన్నుకోడం, ముందుకు సాగడం అనేవేమీ లేకుండా, ఒక ఆనంద ధామంవలె పొడగట్టడం ఒక్క కాల్పనిక లోకంలోనే తప్ప వాస్తవ ప్రపంచంలో కాదు. సుఖాంతులు అభిలషణీయములు గనక కథలు ఆవిధంగా పూర్తి అవుతాయి.

(ఇంకావుంది.)

# A Week in Araku

"Ten days back they killed one of our men. A twenty three-year-old medico who discontinued her studies, shot him at point-blank range, they say," said again Subbaraghaviah.

The atmosphere became tense.

"That man, of course, was corrupt. He was in collusion with a forest contractor. He had been warned earlier of his misdeeds. These Naxalites come to shandy at Narasipatnam quite often. They are law-breakers and killers, no doubt. But the tribals, hold them in deference. They have penetrated deep into the tribal life and the tribals consider them as their benefactors. It is not that simple as it appears to the outside world and presented in newspapers. They have their own methods of assessment. You can be sure they will not come in your way tomorrow. Have a peaceful night and sleep well," observed one of the gentlemen whose name I do not remember.

There were five ladies in the party and each lady was having a minimum of fifteen-thousand worth of gold on her person. That was enough reason for them to feel a bit panicky.

"Alright - if they want to snatch this gold from us, we reconcile to that and offer it ourselves," said Hemalatha and Malati.

Sarojini and Visalakshi were silent, And Parvati, like the proverbial ostrich, said; "I shall keep my bangles and chain in the handbag."

That she did as we moved out of Chintapalli next morning.

## SATURDAY

Environmental pollution is of five kinds: Air, Water, Noise, Thermal and Radio-active. We are quite familiar with the first three in our country. "The environment in which animals and plants become extinct is not safe for the human beings either" said Indira Gandhi. In Andhra Pradesh we have about 30% of the land covered by the forests but the forest wealth is dwindling year after year. Afforestation schemes help preserve the environment to a certain extent. Trees along

with mountains intercept the water-laden clouds and break the force of the rainfall, slowly transmitting to the ground through their crowns and branches. The process preserves the top-soil which works as a sponge in absorbing water. "A tree for every home and a forest for every village," should be a slogan to preserve our ecology.

"Each part is dependent upon another, all are related to the movement of the whole- forests, grasslands, soils, water, animal-life. Without one of these the Earth will die - will become dead as the Moon," says Fairfield Osborn. We were in Chintapalli - the very name indicative of a vast number of trees.

Thoughts about trees and rain and environment are bound to occupy the mind on that last leg of our journey. It was a late dinner the previous night and by six-thirty with steaming cups of coffee in the tray, Simhachalam woke us up with mild tapping at the door. The services rendered and the attention paid by Simhachalam and Apparao and their concern to make us comfortable was something unforgettable. It was not mere service - that human relationship, that affinity and understanding are a part of our Indian hospitality. They are ordinary simple people with large hearts.

As we assembled for breakfast, Subrahmanyam, a local reporter of EE NADU was there to gather from Malati Chendur, her impressions of our visit to these parts. The interview lasted half-an-hour.

Positively by nine the three vehicles moved towards P. Valasa - that is still interior. A branch of a nationalised bank was there - the officer-in-charge took us to his residential quarters just opposite the bank premises. Though a mudhouse it was quite comfortable and roomy with electricity, gas, frigidaire etc. besides a beautiful flower-garden in the front. "We like the place and we enjoy our stay here" said the young couple. A sense of fulfilment was writ on their faces. Countless young men are working in remote corners of this great land, sticking to their posts as bricks in the masonry work of our social structure. They are the pillars of New India, - not the agitators who steal newspaper space and reap the benefit in terms of material wealth. We admired that young man's courage as a banker in that far - flung area.

At P. Valasa there are two roads, one passing through the hillocks of coffee plantation and the other, the main road. As scheduled we took to the hill-side road. We were to go to the hilltop and then climb down. As you negotiate a hairpin bend, another appears before you. It was a steep path of several curves and two motor cyclists were riding in front of the two jeeps. To be at the wheel, one should be thoroughly experienced and acquainted with the area and even then extreme caution was essential. Whether by foot or by vehicle getting on to the tops is always a source of exhilaration. This road was actually laid by the Forest Department and during rainy season travel by jeep is unthinkable. After several curves and bends we reached the top where a nice shed with benches was to greet us.

"During inspection if our men are caught in the rain, they have a shelter here," said Krishnamoorthi.

As we were having a refreshing cup of tea, Archer Tallanayya appeared with his bow and arrow. Even in that dense forest, tribal families are living in small hamlets of ten to twelve hutments. Tellanayya spoke Telugu in his own idiom. Everybody wanted to have a try at the archery- he was smiling within himself at these townsfolk. He asked us to place a lota at a considerable distance and struck it with his arrow making a hole in it. We were surprised at his aim and skill. When we offered him ten rupees in appreciation, he refused to accept. We saw with our own eyes that self-respect of human spirit in an unlettered tribal in the interior of a forest.

"The Naxalite hideouts are not for off - they would have come by this time. if they wanted to," said Subbaraghaviah.

"Shall we wait for some more time?" asked Premchand.

Though Parvathi had already kept her bangles and chain safe in her handbag, she looked a bit perturbed.

"Oh, that is only a joke. Nobody will come in our way. What do they gain by approaching us ? They are no dacoits - they have their motivations and philosophy. I am here since a number of years and I have never heard them harming innocent people - they

fight exploitation of the tribals."

The next halt was at KD Pet (short for Krishna Deva Peta) of Alluri Seetarama Raju. At the guest-house we refreshed ourselves with tender coconut water. The Park constructed in memory of Alluri is in bad shape. It has to be maintained well. The attached library also has to be improved. With no further defilement of the place, the Park can be turned into a tourist attraction, making the surroundings clean and healthy. As it stands, it wears a dismal look.

Narasipatnam is the place where the entire coffee grading is done. We were shown the plant, the method and manner of grading, the machines and the manual labour employed. Much of the work-force is women folk between the age group of sixteen and fortyfive.

"How much does she earn per day?" I asked the gentleman who was showing us round.

"Depends upon the quickness she has acquired. It ranges from seven rupess to twelve rupees a day. To increase efficiency we have to inculcate a spirit of competition."

With a certain amount of confidence the women workers, looked cheerful with satisfaction writ on their brows.

From Narasipatnam to Visakhapatnam the road was fine but the traffic heavy. We reached Vana Vihar guest house by eight-thirty. Next morning we went to SAGARIKA, the residence of DN Rao and Visalakshi, at Bimli, to have a look at the Srinath Memorial Library started by that couple on Oct. 2, 1983 in fond memory of their only son who passed away when barely thirty. SAGARIKA is a dream-house on the waterfront with silent melodies of song and sea. And at three we boarded the Bokaro Express for Madras taking leave of Krishnamurthy and Hemalatha and others.

This one week has enriched our lives in several ways and every one of us from the innermost depths of heart felt the softness of the silken bond of friendship extended by Krishnamurti Garu and his people.

"Love is only chatter-
Friends are all that matter."
The words of Gelett Burgess were ringing in my mind as the train gathered speed.

—NR Chendur

యువకులు కొంచెం సాహసవంతులు. మనం తెగనాడిపోయనక్కర్లేదు. అలా అని ప్రతివారూ తమ వృత్తులూ వుద్యోగాలూ ఎప్పటికప్పుడు మారుస్తుంటే కుదరదు. ఇలా అటా అనిపించినప్పుడు, తగు పరిశీలనతో ఒక మార్గం ఏరుకున్నాక, ఆ మార్గం వెంట నడవడమే శిక్షణ అవుతోంది. మనకి అక్కర లేనివాన్ని, ముందే యిది మనదికాదు, అని పక్కకి నెట్టివేయవచ్చు. ఒకవేళ పొరపాటున తప్పటడుగు పడినా, అది తెలుసుకు, తప్పుదారినుంచి మీకని నిర్ణయింపబడ్డ బాటపైకి రాగలగాలి.

మనకి ఓటమి ఎదురైనపుడు, మనం చేసినది తప్పు అయినప్పుడు, 'చుట్టూవాళ్ళు సరిగా చేయలేదు. నా శక్తికి మించినపని చేయమంటే ఎలా?' అని యీ ప్రకారం మనని మనం సరిపెట్టుకునేందుకు చూస్తాం. అలా నేను చేసి వుండకూడదు, పొరబడ్డాను, అని సగర్వంగా వొప్పుకునేందుకు నిజాయితీ, ధైర్యం, బాధ్యతని ఆమోదించే స్వభావమూ మీలో వుండి వుండాలి. లేకపోతే వొప్పుకోలేరు.

మన పొరబాట్లెప్పుడూ, ముందు ముందు మార్గదర్శకములై, అనుభవ గ్రంథంలో పుటలుగా, భావించుకోగలిగినప్పుడు, జీవితంనుంచి నిజమైన సారం గ్రహిస్తున్నామన్నమాట. అపజయాన్ని విజయసోపానంగా భావించుకోవడం అందరికీ చేతకాదు. మనము ఎంత వుత్తమశిక్షణ పొందినప్పటికీ వివిధమార్గాలు మనకి తరుచు తటస్థపడుతూంటాయి. అటువంటప్పుడు మనం, మన దారి ఏదో మనం ఎన్నుకు, ముందుకు సాగాలి.

బాలబాలికలూ యువతీ యువకులూ యింత బాధ్యతని తమ బుజాలపై ఎలావేసుకోగలరు? - అంటారు కొందరు. మన ఎన్నికలన్నీ కడపటి నిర్ణయాలవడం లేదు. కొన్నిటిని ముందు ఎన్నుకు, ఆ పైన కాదను కొంటున్నాము. అది వద్దనుకొని, మరొకటి కోరుకొంటున్నాము. మీ ఎన్నిక పొరబాటైనంత మాత్రాన కొంప మునగదు. కాని ఎటూ ఎన్నిక లేక, కాలగమనంతో కొట్టుకుపోదామనుకుంటేనే, మీరేమిటో మీకూ తెలియదు, లోకానికీ తెలియదు. అంచేత యువతీ యువకులూ బాలబాలికలూ చేసే ఎన్నికలు విశుద్ధమైనవిగా వుండటం లేదని ఆరాటపడకండి.

చిన్నపిల్లలకి ప్రతికథలోనూ, ఆ కథ చివరికి సుఖాంతముగా వుండాలని పిస్తుంది. అదే నేటి యువతీ యువకులలో కూడా కనపడుతుంది. 'ఆ తరువాత వారు అనేక సంవత్సరాలు సుఖంగా జీవించారు' అని కథ అంతమవుతుంది. అటువంటి విశిష్ట జీవనము, మార్గాలు ఎన్నుకోడం, ముందుకు సాగడం అనేవేమీ లేకుండా, ఒక ఆనంద ధామంవలె పొడగట్టడం ఒక్క కాల్పనిక లోకంలోనే తప్ప వాస్తవ ప్రపంచంలో కాదు. సుఖశాంతులు అభిలషణీయములు గనక కథలు ఆవిధంగా పూర్తి అవుతాయి.

(ఇంకావుంది.)

# A Week in Araku

"Ten days back they killed one of our men. A twenty three-year-old medico who discontinued her studies, shot him at point-blank range, they say," said again Subbaraghaviah.

The atmosphere became tense.

"That man, of course, was corrupt. He was in collusion with a forest contractor. He had been warned earlier of his misdeeds. These Naxalites come to shandy at Narasipatnam quite often. They are law-breakers and killers, no doubt. But the tribals, hold them in deference. They have penetrated deep into the tribal life and the tribals consider them as their benefactors. It is not that simple as it appears to the outside world and presented in newspapers. They have their own methods of assessment. You can be sure they will not come in your way tomorrow. Have a peaceful night and sleep well," observed one of the gentlemen whose name I do not remember.

There were five ladies in the party and each lady was having a minimum of fifteen-thousand worth of gold on her person. That was enough reason for them to feel a bit panicky.

"Alright - if they want to snatch this gold from us, we reconcile to that and offer it ourselves," said Hemalatha and Malati.

Sarojini and Visalakshi were silent, And Parvati, like the proverbial ostrich, said; "I shall keep my bangles and chain in the handbag."

That she did as we moved out of Chintapalli next morning.

## SATURDAY

Environmental pollution is of five kinds: Air, Water, Noise, Thermal and Radio-active. We are quite familiar with the first three in our country. "The environment in which animals and plants become extinct is not safe for the human beings either" said Indira Gandhi. In Andhra Pradesh we have about 30% of the land covered by the forests but the forest wealth is dwindling year after year. Afforestation schemes help preserve the environment to a certain extent. Trees along

with mountains intercept the water-laden clouds and break the force of the rainfall, slowly transmitting to the ground through their crowns and branches. The process preserves the top-soil which works as a sponge in absorbing water. "A tree for every home and a forest for every village," should be a slogan to preserve our ecology.

"Each part is dependent upon another, all are related to the movement of the whole- forests, grasslands, soils, water, animal-life. Without one of these the Earth will die - will become dead as the Moon," says Fairfield Osborn. We were in Chintapalli - the very name indicative of a vast number of trees.

Thoughts about trees and rain and environment are bound to occupy the mind on that last leg of our journey. It was a late dinner the previous night and by six-thirty with steaming cups of coffee in the tray, Simhachalam woke us up with mild tapping at the door. The services rendered and the attention paid by Simhachalam and Apparao and their concern to make us comfortable was something unforgettable. It was not mere service - that human relationship, that affinity and understanding are a part of our Indian hospitality. They are ordinary simple people with large hearts.

As we assembled for breakfast, Subrahmanyam, a local reporter of EE NADU was there to gather from Malati Chendur, her impressions of our visit to these parts. The interview lasted half-an-hour.

Positively by nine the three vehicles moved towards P. Valasa - that is still interior. A branch of a nationalised bank was there - the officer-in-charge took us to his residential quarters just opposite the bank premises. Though a mudhouse it was quite comfortable and roomy with electricity, gas, frigidaire etc. besides a beautiful flower-garden in the front. "We like the place and we enjoy our stay here" said the young couple. A sense of fulfilment was writ on their faces. Countless young men are working in remote corners of this great land, sticking to their posts as bricks in the masonry work of our social structure. They are the pillars of New India, - not the agitators who steal newspaper space and reap the benefit in terms of material wealth. We admired that young man's courage as a banker in that far - flung area.

At P. Valasa there are two roads, one passing through the hillocks of coffee plantation and the other, the main road. As scheduled we took to the hill-side road. We were to go to the hilltop and then climb down. As you negotiate a hairpin bend, another appears before you. It was a steep path of several curves and two motor cyclists were riding in front of the two jeeps. To be at the wheel, one should be thoroughly experienced and acquainted with the area and even then extreme caution was essential. Whether by foot or by vehicle getting on to the tops is always a source of exhilaration. This road was actually laid by the Forest Department and during rainy season travel by jeep is unthinkable. After several curves and bends we reached the top where a nice shed with benches was to greet us.

"During inspection if our men are caught in the rain, they have a shelter here," said Krishnamoorthi.

As we were having a refreshing cup of tea, Archer Tallanayya appeared with his bow and arrow. Even in that dense forest, tribal families are living in small hamlets of ten to twelve hutments. Tellanayya spoke Telugu in his own idiom. Everybody wanted to have a try at the archery- he was smiling within himself at these townsfolk. He asked us to place a lota at a considerable distance and struck it with his arrow making a hole in it. We were surprised at his aim and skill. When we offered him ten rupees in appreciation, he refused to accept. We saw with our own eyes that self-respect of human spirit in an unlettered tribal in the interior of a forest.

"The Naxalite hideouts are not for off - they would have come by this time. if they wanted to," said Subbaraghaviah.

"Shall we wait for some more time?" asked Premchand. Though Parvathi had already kept her bangles and chain safe in her handbag, she looked a bit perturbed.

"Oh, that is only a joke. Nobody will come in our way. What do they gain by approaching us ? They are no dacoits - they have their motivations and philosophy. I am here since a number of years and I have never heard them harming innocent people - they

fight exploitation of the tribals."

The next halt was at KD Pet (short for Krishna Deva Peta) of Alluri Seetarama Raju. At the guest-house we refreshed ourselves with tender coconut water. The Park constructed in memory of Alluri is in bad shape. It has to be maintained well. The attached library also has to be improved. With no further defilement of the place, the Park can be turned into a tourist attraction, making the surroundings clean and healthy. As it stands, it wears a dismal look.

Narasipatnam is the place where the entire coffee grading is done. We were shown the plant, the method and manner of grading, the machines and the manual labour employed. Much of the work-force is women folk between the age group of sixteen and fortyfive.

"How much does she earn per day?" I asked the gentleman who was showing us round.

"Depends upon the quickness she has acquired. It ranges from seven rupess to twelve rupees a day. To increase efficiency we have to inculcate a spirit of competition."

With a certain amount of confidence the women workers, looked cheerful with satisfaction writ on their brows.

From Narasipatnam to Visakhapatnam the road was fine but the traffic heavy. We reached Vana Vihar guest house by eight-thirty. Next morning we went to SAGARIKA, the residence of DN Rao and Visalakshi, at Bimli, to have a look at the Srinath Memorial Library started by that couple on Oct. 2, 1983 in fond memory of their only son who passed away when barely thirty. SAGARIKA is a dream-house on the waterfront with silent melodies of song and sea. And at three we boarded the Bokaro Express for Madras taking leave of Krishnamurthy and Hemalatha and others.

This one week has enriched our lives in several ways and every one of us from the innermost depths of heart felt the softness of the silken bond of friendship extended by Krishnamurti Garu and his people.

"Love is only chatter -
Friends are all that matter."
The words of Gelett Burgess were ringing in my mind as the train gathered speed.

—NR Chendur

JAGATI Telugu Monthly - Vol. 31 No. 362-Sept. 86
Edited, Printed and Published by N. R. Chendur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras-600 004
Phone : 7 6 6 9 7